పలికెనో దేవనీ-భక్తునివిన్నప,
మవధరింపుమువీరు-లైనయన్య।
మనుజేశులును సేతు-మార్గంబువలనలం,
కకువచ్చిపీడింపఁ-గలరుగానఁ।
జెలఁగిధనుష్కోటి-చేసెదుఛేదనం,
బాచరింపుముకరు-ణార్ద్రచిత్త॥

గీ. అనుచుఁబ్రార్థింపఁగాకుసుఁ-డట్లచేసె।
నందువలనధనుష్కోటి-యయ్యెదాని।
దర్శనంబునజంతుసం-తతికిముక్తి।
గలుగునవగాహఫలమేమొ-తెలియరాదు॥ ౧౨౨॥

గీ. రామకరచాపకోటిని-ర్దళితసేతు।
రేఖకైలాసమునకువి-రించిలోక।
మునకువైకుంఠపట్టణం-బునకుస్వర్గ।
మునకుఁదెలుపదితాపస-ముఖ్యులార॥ ౧౨౩॥

వ. మఱియు బ్రహ్మవిష్ణుమహేశ్వరులును, వాణీలక్ష్మీపార్వతులును, వసురుద్రాదిత్యవిశ్వమరుదశ్వ గంధర్వకిన్నరకింపురుష హదులును, పితృదేవతలును, దశకోటి తీర్థగణంబులతోడ ధనుష్కోటి తీర్థంబునసన్నిహితులై వసింతురు, దేవమునిగంధర్వాదు లందుఁ దపంబుఁగావించి మహాసిద్ధిం జెందిరి. తజ్జలంబులం బితృదేవతాతర్పణంబు సేయువారు సర్వపాపముక్తులై సత్యలోకంబునం బూజనొందుదురు. భక్తిపూర్వకంబుగా నచ్చోట నొక్కభోజనంబిడినవారికి ననంతఫలంబుసంభవించు. రేవాతీరంబునం దపంబును, గంగాతటంబునమరణంబును, కురుక్షేత్రంబున దానంబును, మహాపాతకంబుల నశింపఁజేయు. ఏతత్త్రయంబును ధనుష్కోటియందుఁ బ్రాప్తంబయ్యెనేని ముక్తినొసంగు. సకలాభీష్టంబులుసిద్ధించు. ధనుష్కోటిస్నానం బేకవారంబైన నాచరించినవారికి సి

క. రామస్థాపితలింగం।
భీమానవుఁడేకవార-మీక్షించునతం।
డోమునులారశశాంకశి।
ఖామణిసాయుజ్యమొందు-గతకల్మషుఁడై॥ ౩॥

సీ. మునులారకృతయుగం-బునదశవత్సరం,
బులచేతనగునట్టి-పుణ్యఫలము।
సాధించఁబడుమహా-జనులచేనొకవత్స,
రంబునఁద్రేతాయు-గంబునందు।
మాసంబుచేతన_మ్మహితపుణ్యముసంభ,
వించుద్వాపరయుగ-వేళయందు।
నొకవాసరముననయ్యున్నతసుకృతంబు,
కలికాలమునశీఘ్ర-గతిలభించు।

గీ. ప్రతినిమేషంబుఁదత్పుణ్య-ఫలముకోటి।
గుణితమగుమనిరూఢిచె-కురునురామ।
నాథశివలింగసందర్శ-నంబుసేయు।
వారలకుసంశయముసేయ-వలదువలదు॥ ౪॥

క. రామేశ్వరలింగంబున।
ధీమన్నుతసకలపుణ్య-తీర్థములుసమ।
స్తామరపితృదేవముని।
స్తోమములువసించునెప్పుడు-సువ్రతులారా॥ ౫॥

గీ. అరితోమూఁడువేళల-నైనరెండు।
వేళలందైనమతియొక-వేళనైన।
రామలింగంబుఁదలఁచువా-రలకుఘోర।
పాపమునశించునిర్వాణ-పదముగలుగు॥ ౬॥

గీ. రామచంద్రసమర్చిత-రామలింగ।
నామసంస్మరణంబున-నరులకెల్లఁ।

గద్య:— ఇది శ్రీమదుమామహేశ్వర కరుణాకటాక్షవీక్షాపాత్ర, యేనుగ లచ్చయామాత్యపౌత్ర, తిమ్మనామాత్యపుత్త్రి, వివిధ విద్వజ్జనవిధేయు, లక్ష్మణకవినామధేయప్రణీతంబయిన రామేశ్వరమాహాత్మ్యంబను మహాప్రబంధమునందుఁ
ప్రథమాశ్వాసము.
శ్రీ. శ్రీ. శ్రీ.

శ్రీరస్తు.

# రామేశ్వరమాహాత్మ్యము.

## ద్వితీయాశ్వాసము.

---



శ్రీ మత్సమస్తసుజన।
ప్రేమాస్పదభద్రిరాజు-భీమయసుతమ।
ల్లామాత్యనిత్యవైభవ।
క్షేమప్రదపార్వతీశ-శ్రీమల్లేశా॥ ౧॥

వ. అవధరింపుము శౌనకాదిమహర్షులకు సూతుండిట్లు శ్రీరామేశ్వరలింగవైభవంబు వచింపందొడంగె. ౨॥

గీ. అవని రామేశశివభక్తు-లైనవరుల।
యందు నెవ్వారలకుభక్తి-యమరియుండు।
వారుచూడరు భేదమే-వంకనైనఁ।
జనరు దారుణసమవర్తి-సదనమునకు॥ ౧౪॥

గీ. విప్రహత్యాసహస్రంబు-విలయమొందు।
మద్యపానాయుతంబులు-మడసిపోవుఁ।
కాంచనస్తేయగురుతల్ప-గమనదోష।
లక్షలునశించు రామేశు-వీక్షణమున॥ ౧౫॥

మత్తకోకిల.

భూరిసంతతభోగలాభముఁ-బూజ్యనిర్జరరాజ్యముం।
గోరుధీరులుచంద్రశేఖరు-గూఢపాద్గుణకార్ముకుం।
హీరవర్ణనిరామనాథమ-హేశ్వరుం జగదీశునోం।
కారమూర్తిఁ నమస్కరింతురు-గాఢనిశ్చలచిత్తులై॥ ౧౬॥

[illegible] ఉభయలోకములన-తూర్జితానందంబు,
సతతరామేశ్వర-స్మృతినిఁగల్గు।
గోటిజన్మార్జిత-ఘోరపాతకనివ,
ర్తనము గు రామేశు-దర్శనమున।
నఖిలమానవవాంఛి-తార్థసంసిద్ధులు,
[illegible] సేయు [illegible] మేశ-కీర్తనంబు।
శాశ్వతంబగురుద్ర-సాయుజ్యవిభవంబుఁ,
బొందించు రామేశు-పూజనంబు।

గీ. దావవహ్ని విజృంభించి-దారుతతులఁ।
గాల్చిపొడిసేయుకైవడి-ఘనతరోగ్ర।
కలుషవిసర మశేషంబుఁ-గడఁగి ద్రుంచు।
[illegible] రామేశ శివలింగ-సేవనంబు॥ [illegible]

ప్రబలమైనట్టియమదూత-భయము దొలఁగు।
నఖిలతీర్థాభిషేకపు-ణ్యము లభించు॥ ౭॥

క. శ్రీరామేశ్వరలింగస।
మారాధన మాచరించు-మనుజులు మనుజుల్।
గారు మహేశ్వరమూర్తులు।
వారకనుడి సంశయంబు-వలదియ్యెడలన్॥ ౮॥

గీ. కలిలోఁ దాను రామలిం-గార్చనంబు।
సేయఁడేని వాఁడు దుర్మార్గ-శీలుఁ డగుచు।
వాఁడు పెక్కేండ్లు పరితేని-వనటఁ జెందు।
ఘోరగంభీరసంసార-కూపమునను॥ ౯॥

ఉ. పూనిక రామచంద్రపరి-పూజితు నవ్యయు రామనాథునీ।
శానునిఁ జూచు నెవ్వఁడొక-సారెతపోనిధులార వానికిన్।
దానతపోధ్వరవ్రతవి-ధానములేటికి నన్యదేవతా।
ధ్యానములేటికిన్ వివిధ-ధర్మములేటికి కర్మమేటికిన్॥ ౧౦॥

చ. శ్రుతిమయు రామనాథుఁ దన-చూడ్కులకింపుగఁ జూడఁ డేనియుం।
దతఁడు జడుండు మూఢుఁ డత-డంధుఁ డతండు కరాంఘ్రివర్జితుం।
డతఁడు దరిద్రుఁ డాతఁడు రు-జార్తుఁ డతండు ఖిలుండతండు త।
త్సుతధనధాన్యమందిరప-శుప్రకరంబు నశించు నెంతయున్॥ ౧౧॥

ఉ. మానుగ దుర్లభంబయిన-మానుషజన్మముఁ బూని భూమిలో।
మానవు లెవ్వరేని ఫణి-మండనమండితు రామనాథుఁ బం।
చాననుఁ గాంచి మ్రొక్కి విన-యంబునఁ బూజ లొనర్తు రాజనుల్।
మానివరేణ్యులార మతి-మత్ప్రవరుల్ కృతకృత్యులిద్ధరన్॥ ౧౨॥

గీ. రామనాథునిఁ ద్రిభువన-స్వామిఁ దలఁచు।
వారలకుఁ బూజనము సేయు-వారలకును।
బద్మలోచనపద్మసం-భవపురంద।
రాదిసురపూజనంబు ని-రర్థకంబు॥ ౧౩॥

సొంపుదీపింప రామేశుఁ-జూచిరేని।
యెల్లజనులు నుసములని-యెఱిఁగికొనుఁడు॥ ౧౨

గీ. కన్నులారంగ రామేశు-గరళకంఠుఁ।
గాంచ మనెవ్వాఁడు సద్భక్తి-కలితుఁడగుచుఁ।
జర్చ చేసిన నతనికి-సాటిగాదు।
విప్రకులవర్యుఁడగుచతు-ర్వేదియైన॥ ౧౩.

ఉత్సాహము. హాళిమెరయ రామనాథు-నందుభక్తిగలుగుచం।
డాలునకును దానముంగ-డంకతోడనీదగున్।
మేలు గాదు భక్తిలేని-నిఖిలవేదశాస్త్రవి।
న్నాళికిడిన ఫలము లేశ-మాత్రమైనఁ గల్గునే॥ ౧౪.

గీ. నెమ్మి రామేశ్వరక్షేత్ర-నిలయులైన।
వారు శశిశేఖరులు పంచ-వదనులురగ।
భూషణులు ఫాలనేత్రులు-భూతికలిత।
దేహులు మహేశులగుదురు-ధీరులార॥ ౧౫॥

క. కడు వేడ్క డెందములసం।
దడిగొన శ్రీమంతు రామ-నా జూడన్।
బడిబడి నేగెడు సుజనుల।
కడుగడుగునన శ్వమేధ-యాగఫలముగున్॥ ౧౬॥

గీ. రామసేతువునకుఁజని-రామనాథ।
శంకరునకుఁ బ్రియంబుగ-సద్విజునకు।
గ్రామమొకటిని నొసఁగిన-భూమిపతికి।
నఖిలభూచక్రదానపు-ణ్యములభించు॥ ౧౭॥

క. దళమును కుసుమము ఫలమును।
జలమును శ్రీరామనాథ-శంకరునకుని।
శ్చలభక్తి నొసఁగుజనముల।
నలరామేశ్వరుఁడు బ్రోచు-ననవరతంబున్॥ ౧౮॥

సీ. మునులార వివరింతు-వినుఁడష్టవిధములఁ,
జెన్నొందు రామేశ-శివుని భక్తి।
తద్భక్తులందు వా-త్సల్యంబు గలుగుట,
పూజావిధానము-ప్పాంగికనుట।
తాఁబూజసేయుట-తత్పూజనారంబు,
దేహమెచ్చుట నైనఁ-ద్రిప్పికొనుట।
కరమర్థిఁదత్పుణ్య-కథలాలకించుట,
స్వరదృగంగవికార-శాలియగుట।
గీ. యెలమి నెప్పుడు రామేశుఁ-గొలిచిమనుట।
విత్తము తదర్పితంబుగా-వించిమనుట।
యిట్టిశివభక్తిగలుగువాఁ-డెవ్వఁడైన।
బ్రహ్మసాయుజ్యపదవికిఁ-బాత్రమఁతఁడు।। ౧౮।।
శా. వేదాంతశ్రవణైకసంభవమహా-విజ్ఞానలక్ష్మీయుతుల్।
ఖేదామోదవివర్జితుల్ యతులుము-క్తింబొందుచందంబునన్।
వేదాత్మున్శివు రామనాథునభవు-న్వీక్షించుధన్యుల్ జనుః।
ఖేదాపాయకరాపవర్గముమభ-క్తింగాంతు రెప్పట్టునన్।। ౧౯.
శా. వైరాగ్యంబుయతిత్వముఙ్ శ్రుతిశిరో-వాక్యార్థవిజ్ఞానముం।
ఘోరంగాఁబని లేదు మానవులక-ష్టోభంబుగా నేరికిఙ్।
శ్రీరామేశ్వరలింగదర్శనమునఙ్-సిద్ధించుమోక్షంబుద।
తాఁగారుణ్యాతిశయంబసాధనమగుం-గైవల్యసంప్రాప్తికిఙ్।। ౨౦.
గీ. క్రిమికులంబుశకుంతముల్-కీటములును।
జనులుబృందారకులుతపో-ధనులుమునులు।
పుణ్యరామేశ్వరక్షేత్ర-భూమియందు।
సములురామేశ్వరునిసుప్ర-సాదకలన।। ౨౧.
గీ. పుణ్యుఁడనటంచుగర్వంబు-బూనవలదు।
పాతకినటంచుమనమున-భయమువలదు।

శ్వరుఁడుండఁజెంద నేటికి।
నరకాలయఘోరయాత-నాసంప్రాప్తుల్॥ ౩౫॥

గీ. విశ్వలోకకుటుంబిరా-మేశ్వరుండు।
సాంద్రకరుణాపయోధిప్ర-సన్నుఁడైన।
వివిధదుర్వారయాతనల్-విలయమొందు।
మంచుతపనోదయమునన-శించుకరణి॥ ౩౬॥

గీ. అవని నెవ్వాఁడు ప్రాణని-ర్యాణవేళ।
రామనాథునిగిరిసుతా-రమణుఁ బలఁచు।
నతఁడుగ్రమ్మరమాతృగ-ర్భాంతరమున।
నధివసింపకశంకరుఁ-డై వెలుంగు॥ ౩౭॥

గీ. రామనాథమహాదేవ-రాజమకుట।
భర్గరక్షించునన్నుగృ-పానిధాన।
యనుచు నెవ్వాఁడుబలుకున-హర్నిశంబుఁ।
గలుగదతనికి నేమియుఁ-గలిభయంబు॥ ౩౮॥

సీ. నందివాహనరామ-నాథజగన్నాథ,
నీలలోహితరుద్ర-నిర్మలాంగ।
శితికంఠహరసదా-శివమహాదేవరా,
మేశశంకరవ్యోమ-కేశయభవ।
అంతకాంతకత్రిపు-రాంతకరామేశ,
శర్వమహేశప-శ్వల్లలాట।
కాలకూటాశన-గౌరీమనోహర,
భర్గరామేశ్వర-భవగిరీశ।
గీ. యనుచు సంతతమనురాగ-మునవచించు।
నరుఁడు మాయకుఁజిక్కక-దురితములకు।
బట్టుపడఁబోకకాముని-బారిఁబడక।
క్రోధహితుఁడును గాక చే-కొను సుఖంబు॥ ౩౯॥

క. కరుణానిధియగు రామే।
శ్వరభజనము పూజనంబు-స్తవము నునామ।
స్మరణము నుమానవులకున్।
ధరణింగడు దుర్లభములు-తాపసులారా॥ ౨౯॥

గీ. భక్తితోడమహాదేవు-భవునిరామ।
నాథుశరణంబు వేడిన-నరులకెల్ల।
శాంతమతులారలాభంబు-జయముగల్గు।
నరయనిహపరలోకద్వ-యంబునందు॥ ౩౦॥

గీ. పరమకారుణ్యరసపూర-భరితహృదయుఁ।
డైనరామేశునందు నె-ప్పానిబుద్ధి।
పగలురేయును గొలక-దగిలినిలుచు।
ధాత్రిలోపల నాతండు-ధన్యతరుఁడు॥ ౩౧॥

క. శ్రీవిశ్రుతరామేశ్వర।
సేవావైభవమువలన-సిద్ధించనిచే।
తోవాంఛితశుభఫలములు।
వావిరిబ్రాపింపుమసితర-వరధర్మములన్॥ ౩౨॥

ఉ. పంకజగర్భవంద్యపద-పంకజు నాగమవేద్యు గూఢపా।
త్కాంకణు రామనాథు శితి-కంధరు నంధకవైరి నిందురే।
ఖాంకురమౌళినీశ్వరునొ-కప్పుడుఁ జూడనిదుర్జనుండిలన్।
సంకరజాతిగాక పితృ-సంభవుఁడే మది నెంచిచూచినన్॥ ౩౩॥

క. రామేశ్వర రామేశ్వ।
రామేశ్వరయనుచు జనులు-ప్రత్యూషమునన్।
నేమంబుతోఁ బఠించిన।
నామే టికిఁ బూర్వదినకృ-తాఘము వాయున్॥ ౩౪॥

క. నరులార ముజ్జగములకు।
ద్వారభక్తత్రాణదీక్షి-తుఁడు శ్రీరామే।

మాధుండు బ్రహ్మహత్యాయుతంబు గాంచిన పాతకంబుఁ జెందు. తత్సంభాషణమాత్రంబున నరుండు నరకంబునం బడు. వేదంబులు యజ్ఞంబులు, ధర్మంబులు, రామనాథపరంబులై వర్తించు. తదన్యంబగు పదార్థంబెద్దియుం గలుఁగనేరదు. కావున సర్వంబు విడనాడి రామనాథేశ్వరు నీశ్వరు నాశ్రయించునది. ఆమ్మహాదేవు శరణుఁ జెందిన జనుండు నరకంబుఁ గనుంగొనక శివలోకంబునకుం జను. సకల యజ్ఞతపోదానతీర్థస్నానంబుల వలనం గలుగు ఫలంబు కోటిగుణితంబై రామేశ్వరసేవా వైభవంబునం గలుగు॥ ౭౨॥

సీ. నాగభూషణు రామ-నాథేశ్వరుని రెండు,
గడియలు చింతించు-ఘనుఁడు వేవు-
నేకవింశతికులో-పేతుఁడై శివలోక,
మునకేగి సంతోష-మున వసించు।
బత్తిమీఱఁగనొక్క-పగలు చూచినవాఁడు,
పాపవిముక్తుఁడై-ఫలము నొందు।
కడఁక వేకువ లేచి-గౌరీశు రామేశుఁ.
దలఁచు నరుండు ప్ర-త్యక్షశివుఁడు।
గీ. రామనాథునిఁ బొడగాంచు-నేమహాత్ముఁ।
డతనిఁ జూచినయంతన-యఖిలజంతు।
సంతతికి రౌరవాదిదు-రంతనరక।
యాతనాహితదురితసం-ఘాతమడఁగు॥ ౭౩।

క. మధ్యాహ్నవేళ మునిహృద।
యధ్యేయుని రామనాథు-నభవు నిజగదా।
రాధ్యునిఁ గనుఁగొను జనులక।
సాధ్యసురాపానదోష-శయ నాశమగున్॥ ౭౪।
మాలిని నతజనహితు గౌరీ-నాథు శ్రీరామనాథున్।
జితమదను గృపారా-శిం బ్రదోషంబునం దున్।

సీ. రామనాథునిమంది-రము దారువులఁ జేయు,
మనుజుండు సురలోక-మునఁ ద్రికోటి।
కులయుతుఁడై నిల్చు-కుదురుగా నిటుకఁ గ,
ట్టినవాఁడు వైకుంఠ-మునవసించు।
శిలలచేఁ గట్టించు-నలఘుపుణ్యుఁడు బ్రహ్మ,
పట్టణంబున నెప్డు-బాయకుండు।
స్ఫటికాదిబహువిధో-పలముల రామేశు,
భవనంబు నిర్మించు-పావనుండు।
గీ. భానుమండలతులితవి-మాన మెక్కి।
సురవధూకరచారుచా-మరమనోజ్ఞ।
మారుతాంకూరసంవీజ్య-మానుఁడగుచు।
హరునిలోకంబునకుఁ జను-సురలు వొగడ॥ ౪౦॥
గీ. ధీరుఁడై వాఁడు రామేశు-దేవళంబు।
వెండిపలకల రచియించు-వేడ్క మీఱ।
భవ్యశంకరసారూప్య-పదవిఁ గాంచు।
నతఁడు శివుమాడ్కి నానంద-మనుభవించు॥ ౪౧॥
గీ. మట్టుమీఱంగ రామేశు-మందిరంబుఁ।
గలిమిగలవాఁడు గట్టించుఁ-గాంచనమున।
పూని మట్టినిఁ గట్టించు-లేనివాడు।
తెలియ నిరువురకుఁ బుణ్య-ఫలము సమము॥ ౪౨॥
గీ. శక్తికొలఁది నివివిధోప-చారములను।
పూని రామేశ్వరునిఁ గొల్వఁ-డేనరుండు।
భుక్తికిని ముక్తికిని రాజ్య-మునకు నతఁడు।
భాజనము గాఁడు పరమని-ర్భాగ్యుఁడతఁడు॥ ౪౩॥

వ. మఱియు భక్తితాత్పర్యంబుల రామనాథేశ్వరుం బూజించువాఁడు భుక్తిముక్తిరాజ్యభాజనంబగు రామనాథార్చనసమంబునుం, దదధికంబును నగు పుణ్యంబు లేదు. రామనాథేశ్వర లింగద్వేషియగు

మొనసి తైలాభ్యంగ-మొనరించుకొనునను,
షణ్ముఖలోకవా-సంబుదొరకు।
రామేశ్వరుని నిత్య-రసపూరమున ముంచు,
నతఁడు చందురునింట-నమరి మెలఁగు।

గీ. రామనాథునిఁ ద్రిభువన-స్వామి నభవుఁ।
శాకవిదళితపరిమళ-భరిత చూత।
ఫలరసాసారకలనఁ జొ-ప్పిలఁగఁ జేయు।
పుణ్యశీలుండు పితృలోక-మున వసించు॥ ౫౨॥

శా. సంతోషంబున నారికేళసలిల-స్నానోపచారంబు మా।
కాంతాభర్తకు రామనాథునకుఁ జ-క్కంజేయు మర్త్యుండు దు।
ర్దాంతబ్రహ్మవధాదిభూరికలుష-వ్రాతంబులన్నిర్మల।
స్వాంతుండై పరిమార్చి భోగపరుఁడై-వర్తించు నెప్పట్టునన్॥ ౫౩॥

క. లలితపచేళిమరంభా।
ఫలరసముల రామనాథ-భవలింగముఁ జొ।
ప్పిలఁ జేయు భాగ్యవంతుఁడు।
పొలుపుగ సామీకలోక-మున వసియించున్॥ ౫౪॥

ఆ. వస్త్రపూతవిమల-వారిని రామనా।
థాభిషేకకృత్య-మాచరించి।
నరుఁడు వరుణలోక-పరమసౌఖ్యము నొందు।
వానివంటివాఁడు-వసుధఁ గలఁడె॥ ౫౫॥

గీ. ఎలమి నెవ్వాఁడు రామనా-థేశ్వరునకుఁ।
జందనోదకధారల-జలకమార్చు।
నతఁడు గాంధర్వలోకవి-ఖ్యాతమత్త।
కాశినీదివ్యసంభోగ-కలనఁ గాంచు॥ ౫౬॥

సీ. పుష్పవాసిత తోయ-ముల రామనాథున,
కభిషేకమొనరించి-యమరనాథు।

శ్రుతివినుతచరిత్రుం-జూచుసద్భక్తిసెవ్వం!
డతనికిగురుతల్పా-వాప్తిదోషంబడంగున్॥ ౪౭॥

క. సాయంకాలంబునశుభ!
దాయకు రామేశుబహువి-ధంబుల స్తవముల్!
సేయునరుండుసువర్ణ!
స్తేయసహస్రంబునడఁగు-దేవునికరుణన్॥ ౪౮॥

గీ. మానులారధనుష్కోటి-మజ్జనమునఁ!
దారకంబగురామేశు-దర్శనమున!
శివునియర్చాసనమునన-శించునరుఁడు!
ముదితుఁడైశివసాయుజ్య-పదముగాంచు॥ ౪౯॥

వ. రామేశ్వమహాదేవుని మజ్జనశాలాంగణంబునఁద్రిసంధ్యంబును నృత్యగీతఘంటాకాహళి భేరీమృదంగశంఖవేణువీణాపటహపణవగోముఖమడ్డుడిండిమఝర్ఝరాదిమహావాద్యఘోషంబుల మహోత్సవంబుగావించువాఁడు మహాపాతకవిముక్తుండై రుద్రలోకంబునసుఖంబుండు. రామేశ్వరునభిషేక సమయంబున రుద్రాధ్యాయంబును, చమకంబును, బురుషసూక్తంబును, త్రిసుపర్ణంబును, బంచశాంతులును, బావమానసూక్తంబులును, జపించువారును, పంచగవ్యంబుల నభిషేకంబుసేయువారును నరకంబుఁజూడరిది సత్యంబు॥ ౫౦॥

చ. కృపగలరామనాథునకుఁ-గేవలభక్తిదలిర్పగోఘృత!
స్నపనముసేయువాఁడుబహు-జన్మశతార్జితపాపముక్తుఁడై!
విపులసుఖంబుఁజెందుఁగడు-వేడుకఁబాలనొనర్చువాఁడుశీ!
లపరతనేకవింశతికు-లంబులతోహరుఁజేరునొప్పగన్॥ ౫౧॥

సీ. దధినిరామేశ్వరుఁ-దడుపుమానవునకుఁ,
గమనీయవిష్ణులో-కంబుగలుగు!
మధువునభిషేక-విధియొనర్చినవాఁడు,
నలినగర్భునిపట్ట-ణముననిలుచు!

గీ. పాసగ రామేశునభిషేక-మునకుభక్తి
బొదలఁబాలిచ్చి పెనుసాధు-మొదవునిడిన
భాగ్యశాలికిహయమేధ-ఫలముదొరకు
నభవుసారూప్యమమరదే-హాత్యయమున॥ ౬౨॥

క. సేతువునధనుష్కోటి
బ్రీతినిరామేశునీశుఁ-బేర్కొనిపురుషుం
డేతోయమునమునింగిన
సేతునిమజ్జనఫలంబు-శివకృపఁగలుఁగున్॥ ౬౩॥

వ. మఱియు రామనాథలింగంబు సుధాలిప్తంబుగావించినవాని పుణ్యఫలంబు వక్కాణింప శతసంవత్సరంబులకైన సమర్థుఁడఁగాను. రామేశుమందిరంబు శిధిలంబగునేని వెండియునూతనంబుగానమర్చినపురుషునకుఁ బూర్వకర్తకన్న శతగుణంబగు మహాపుణ్యంబుఁ జెందు పదివేలబ్రహ్మహత్యలు నశించునాస్వామి యగ్రభాగంబున, దీపంబులిడిన జనులవిద్యాపటలంబు భేదించి పరబ్రహ్మ సాయుజ్యంబుఁ జెందుదురు. ఘృతతైలముద్గతండులగుడశర్కరాదిపదార్థంబులు సమర్పించువారు దేవేంద్రస్థానంబున వసింతురు. రామేశ్వరమహాదేవలింగంబు దర్శించినఁ బూజించిన స్మరించిన స్పృశించిన నెల్లవారికి సకలపాపంబులును దొలంగు.

గీ. కంచుగంటయునద్దంబు-కాన్కగాఁగ
నెలమితోరామనాథున-కిడినప్రోడ
భాసురవిమానశతభోగ-పరతనొంది
శ్రీమహాదేవుపురినివ-సించుఁదడవు॥ ౬౪॥

సీ. డమరుకడిండిమ-ఢక్కాకాదుందుభి,
పణవగోముఖశంక-పటహలటహ
వంశకాంస్యాదిక-వాదిత్రములునవ్య,
వాద్యవిశేషము-ల్వలనువిూఱ

నగ్రాసనం బెక్కి-యతి సౌఖ్యమున నుండు,
పాటలపున్నాగ-పంకజాత।
కువలయకల్హార-కుసుమవాసితవారి,
ధారావగాహనో-త్సవముఁ జేసి।
కలుషవిముక్తుఁడై-కనుపట్టుమానవుం,
డితరవిచిత్రవి-శ్రుతసుగంధి।
గీ. సుమచయామోదసమ్మిళి-తసురభిసలిల।
పూరమున రామనాథునా-ప్లుతునిఁ జేసి।
సకలభువనమహోన్నత-శంభులోక।
శాశ్వతసుఖాంబునిధి దేలి-సలుపుచుండు॥ ౫౭॥

క. ఏలాలామజ్జకహిమ।
వాలుకలం బరిమళించు-వారిని స్నానం।
బోలిన రామేశ్వరునకు।
లోలతఁ గావించవహ్ని-లోకము గలుగున్॥ ౫౮॥
చ. చెలువగు రామనాథునభి-షేకమొనర్చుటకై మనోజ్ఞమౌ।
త్కలశము లిచ్చునట్టిశుభ-కర్ముఁడుఁ గాంచుఁ జిరాయురున్నతుల్।
విలసితతామ్రకుంభములు-వేడ్కనొసంగినవాఁడు నిర్జరాం।
జలిపుటలాలితోన్నతవి-శాలపదంబుననుండు నెప్పుడున్॥ ౫౯॥

గీ. చేరి రామేశ్వరుని యభి-షేకవిధికి।
దివ్యతీర్థజలంబులు-దెచ్చుకొఱకు।
వెండికుండలు నెమ్మది-నిండు వేడ్క।
నిడెడువాఁడు వసించు వా-ణీశు పురిని॥ ౬౦॥
క. బంగారుబిందె లిడియును।
ప్పొంగు ముముక్కంటిపీటఁ-బోలుచు నురతనం।
పుంగడవలుగడు వేడ్కనొ।
సంగిన నెలదారి చెంతఁ-జక్కఁగ నిలుచున్॥ ౬౧॥

డై మేలుఁ జెందితుదిహిమ।
ధామకళాధారియైయు-దంబునసుండుఁ॥ ౭౧॥

క. పాత్రములలోనసుత్తమ।
పాత్రము రామేశ్వరుండు-పరమార్థముత।
త్పాత్రసమర్పితమగునను।
మాత్రమునువిశేషఫలస-మగ్రతఁ జేయుఁ॥ ౭౨॥

గీ. నందివాహనుగౌరీస-నాథురాము।
నాథుఁబొడఁగనువంతకు-నరునివెంట।
నంటితిరుగునువిప్రహ-త్యాదులయిన।
కలుషపుంజంబులంతట-విలయమొందు॥ ౭౩॥

చ. గొడుగులుతాళవృంతములు-కుంచియలుఁ సితచామరంబులుం।
బడగలుతామ్రకాంస్యమయ-పాత్రచయంబును వెండిగిన్నెలుం।
గడు బెడగైనచిత్రమణి-కాంచనకుంభములున్సుభక్తిచే।
నిడియొడివాఁడఖండితమ-హీతలమేలుఁభవాంతరంబునఁ॥ ౭౪॥

వ. మఱియు రామేశ్వరస్వామికి వివిధసురభికుసుమ మాలంబులు గ ల్పించిన పుణ్యాత్ములకుహాయమేధయజ్ఞఫలంబుగలుగు. చం దనాగరుకుంకుమ కర్పూర కస్తూరి సుగ్గులు దేవదారు ద్రవ్యంబు లును, పునుగుచాదుజవ్వాది పన్నీరు మొదలయిన సుగంధంబులు ను, నానావిచిత్రదుకూల వస్త్రంబులును, కిరీటకుండల కేయూర హార కంకణాది మణి భూషణంబులును సమర్పించువారు ధనా ఢ్యులును. వేదపారగులునై జన్మింతురమ్మహాదేవుని కనుమాత్రంబు ను నిచ్చువాఁడును, చక్రవర్తియైపుట్టు నద్దేవుని పూజానమస్కార స్మరణశ్రవణదర్శనంబుల దుర్లభంబగునది యెద్దియుం గలుగదు. గంగాతోయంబులు దెచ్చి యభిషేకంబుఁ జేసిన భాగ్యవంతుఁడు సాంబశివుని చేతం బూజవడయు నమ్మహాలింగమూర్తిని సేవించం బోవువానింగమంగొని తత్పాపంబులన్నియు భయంబునం బరుగు

సమకూర్చి రామేశ-శంకరు సేవించు,
ఘనులు మహాభోగ-కలితులగుచు।
వాద్యఘోషాన్విత-వరవిమానము లెక్కి,
శివునిలోకమునకుఁ-జేరితడవు।
గీ. సలుపు రెవ్వాఁడు ప్రేమచే-నిఖిలభర్త।
రామనాథేశునద్రిజా-రమణు గురించి।
క్రొంచెమేనియొసంగునా-గుణపయోధి।
కమితఫలమగునది సంశ-యంబు వలదు॥ ౬౬॥

క. రామేశక్షేత్రంబున।
రామేశుని జెంగటన్ని-రంతరము మహా।
ప్రేమమున నుండుజనునిక।
నామయమోక్షంబు కరత-లామలకమగున్॥ ౬౭॥
చ. సిరులును జవ్వనంబు మతి-జీవనముల్ సుతదారవర్గముల్।
పెరవరిరోగు క్షేత్రపశు-విత్తగృహాదులు రాజతస్కరా।
ద్యుతరబాధ చేనణఁగు-నూర్జిత మెద్దియుఁగాదు గానఁద।
త్పరిచితమానిమానవుఁడు-భవ్యవిరాగముఁబూని ధీరుఁడై॥ ౬౮॥

క. కరుణానిధియగు రామే।
శ్వరు బిరబిర నేగి కాంచి-శరణొందవలెన్।
వరదుండగు నద్దేవుని।
స్మరణంబును గీర్తనంబు-సలుపఁగవలయున్॥ ౬౯॥
క. అపన్నార్తినివృత్తి।
వ్యాపారధురీణుదీన-వత్సలునగరా।
ట్చాపుని రామేశ్వరుఁగరు।
ణాపరుఁగొల్చిన నుగర్భ-నరకము దప్పన్॥ ౭౦॥
క. రామేశ్వరదేవునకున్।
గ్రామములిడు వాఁడు పుణ్య-గౌరవకలితుం।

స్వైరపక సీతనీయకయ-నీతికిఁ జొచ్చెదశాస్యుఁడంచు నే।
డైరపుఁ బూనెనోయనఁగఁ-దిగ్మకరుండు వహించె రక్తిమన్॥ ౯౯॥

సీ. మహనీయత్రిభువన-మధ్యస్థశాఖితా,
పసమస్తకములకుఁ-బల్లజడలు।
తారకాపథభద్ర-దంతావళమునకు,
నవనవరక్తరాం-కవపటములు।
యాధోధిరాజమ-హారణ్యరేఖకు,
లసమానకోమల-కిసలయములు।
నిఖిలహరిత్పురం-ధ్రీలలాటములకు,
సింధూరధాతువి-శేషకంబు।

గీ. లగుచుఁ గింశుకముకుళర-క్తాబ్జబంధు।
జీవకంకేళికుసుమరు-చిప్రబంధ।
బాంధవములైనవృద్ధప్ర-భాకరారు।
ణాతపములుదనర్చెన-య్యవసరమున॥ ౧౦౦॥

శా. ఘోరాపారగభీరమైనజలధిం-గోదండముక్తోజ్జ్వల।
క్రూరాస్త్రంబులనింకఁజేసియిదెకా-కుత్స్థుండులంకేశసం।
హారేచ్ఛం జనుదెంచెమీకునిఁక సౌ-ఖ్యంబెంచు లోకాళికిం।
పారం జెప్పఁగ నేగనాఁజనియెఛ్ఛా-యాసాధుఁ డస్తాద్రికిన్॥ ౧౦౧॥

గీ. జరఠదినకరపశ్చిమ-జలధిపతన।
సమయతద్దీప్తిహరణార్థ-జలవినిర్గ।
తౌరధుర్వారకీలంబు-లనఁగ నంబ।
రమునఁ గనుపట్టెనవసాంధ్య-రాగరుచులు॥ ౧౦౨॥

చ. అగణితవీరవానరబ-లావృతుఁడై విజిగీషరాముఁడో।
ప్పఁగఁ జనిలంకపైగవిసె-భూరిరణంబగుఁ దోడుగావలెం।
దగినగతిం దశాస్యునకుఁ-దారనియొల్లెడనున్న రక్కసుల్।
బిగువుగఁ గూడివచ్చిరన-భీషణవృత్తినిఁ గ్రమ్మెఁ జీఁకటుల్॥ ౧౦౩॥

లిడుంగావున నింద్రియంబులు వికలంబులుగానిముంద, ముదిమి రా
నిముంద, మతిచలింపనిముంద, ముముక్షు లగువారు వందనార్చన
ధ్యాన స్మరణకీర్తనస్తుతి శ్రవణదర్శనంబు లాచరించి రామేశ్వరు
నారాధింపవలయు తత్పూజాసమానం బయిన ధర్మంబు సకలపు
రాణ ధర్మశాస్త్రంబులయందు లేదు. నిత్యంబును భక్తి తాత్పర్య
విశ్వాసంబుల నతని సేవించు పుణ్యశీలురు భూలోకంబునం బుత్త్ర
దారధనధాన్యసంపన్నులై పెద్దకాలంబు సకలశుభంబు లనుభవిం
చి శరీరాంతంబున శివసాయుజ్యముక్తిం బొందుదు రిది రామేశ్వరు
వైభవంబు దీని వినినం జదివిన నెల్లవారికి రామేశ్వర సేవాఫలంబు
ను, ధనుష్కోటితీర్థస్నానపుణ్యంబును సిద్ధించునని సూతుండు శౌ
నకాది మహామునులకు వివరించిన నమ్మహానుభావులు శ్రీరామచం
ద్రుం డెటువలె శివలింగప్రతిష్ఠంబు గావించెఁ దత్ప్రకారంబును,
నమ్మహాలింగమూర్తి మహిమంబును సవిస్తరంబుగా నుపదేశించి మ
మ్ముఁ గృతార్థులం గావింపుఁడని ప్రార్థించిన నతం డిట్లనియె. ౨౫॥

ఉ. రాముఁడు లోకరక్షకుఁడు-రాక్షసమాయలఁ జిక్కి కానలోఁ।
భూమితనూజఁ బాసి రవి-పుత్త్రుఁ గనుంగొని మైత్రి చేసి శా।
ఖామృగసేనఁ గూర్చి దశ-కంఠజయార్థ మొనర్చె విక్రమ।
శ్రీ మెరయంగ సముద్రమున-సేతువు మోక్షసుఖైకహేతువున్ ॥౨౬॥

గీ. ఇట్లగాధపయోధిపై-నెలమిఁ గదుర।
సేతువు ఘటించి రాముఁడా-సేతుసరణి।
పూర్ణిమాతిథి రావణు-పురికి నేగె।
బహుళకపివీరపరివార-సహితుఁ డగుచు॥ ౨౭॥

వ ఇట్లు లంకకుఁ జని సువేలశైలం బెక్కి నిలిచె ననంతరంబ. ౨౮॥

చ. కరుకుదనంబు మీఱఁగ జ-గజ్జనయిత్రిని ధాత్రిపుత్త్రికం।
జెఱఁగొని దెచ్చి పట్టణము-చెంతకు రాముఁడు వచ్చినప్పుడు।

దనరెమనోజ్ఞలాంఛనము-తత్తనుకాంతులనందగెన్నర।
ద్ఘనఘనసారహారగుళి-కాపటసోదరసాంద్రచంద్రికల్॥ ౮౮॥

శా. కాసారంబులు పెల్లుగాఁగురిసెనీ-హారాంశుపాషాణముల్।
కాసారంబులఁగుంటెఁగోకవితతుల్-గన్నీరుమున్నీరుగా।
కాసారంబులఁబాంథబృందములసం-ఖ్యాతవ్యథంజెందెరా।
కాసారంగధరప్రకాశములుఁవీ కంబైపయింబర్వఁగాఁ॥ ౮౯॥

క. పారావారముగర్వము।
పారముగావిరహితతికి-భారముగానం।
భోరుహములకువికాసము।
దూరముగావలుముకొనివి-ధుప్రభలమరెఁ॥ ౯౦॥

సీ. పసస్థాణుమతినైనఁ-బల్లవింపఁగఁజేయఁ,
జాలుపుష్పాస్త్రియ-శంబనంగ।
లోకంబులెటువంటి-వోకాంతుననువేడ్క,
వచ్చిత్రిమ్మరుదుగ్ధ-వార్ధియనఁగ।
వరచకోరులుపిండి-వంటకైయారించు,
శాలితండులచూర్ణ-పాళియనఁగ।
వైరియిట్లనిక్రోధ-వహ్నిమారుఁడుగాంచఁ,
గరగినీరగువెండి-గట్టనంగ।

గీ. నిఖిలభువనాంతరసిత-నీలవస్తు।
ధవళిమాపాదనప్రౌఢ-తరనిరూఢ।
పాండురాఖండచంద్రికా-మండలంబు।
పుండరీకభవాండంబు-నిండిమెరసె॥ ౯౧॥

వ. అయ్యెడ. ౯౨॥

ఉ. పెన్నిధిసన్నిధింగనిన-బీదలభంగిఁజెలంగియాడుచుం।
బున్నమవెన్నెలల్ చెలుల-పొత్తునఁగుత్తుకబంటిగ్రోలుచుం।

సీ. అస్తోకశోకప్రి-యావియోగాగ్నిసం,
భూతోగ్రధూమసం-ఘాతమనఁగ।
విరహిసంహారణత-త్పరపంచశరనవో,
త్పలశిలీముఖకాంతి-పటలియనఁగ।
రమణీయదశదిశా-రమణీమణీకపో,
ద్దీపితమృగమదా-లేపమనఁగఁ।
గమనీయరోదసీ-కాసారశైవాల,
మంజులమంజరీ-పుంజమనఁగఁ।

గీ. బతిసమాగమకుతుకసం-భృతమనోజ్ఞ।
యామినీకామినీమఘు-నాశ్మనిచయ।
ఖచితసముచితభూషణా-రుచిరరుచివి।
తానమనంధకారంబు-దనరెఁ దెసల॥ ౧౨౪

గీ. రాజురాకకుఁ గగనమా-ర్గమునమృగమ।
దమునఁ గలయంపి వెట్టిది-గ్రమణులాణి।
ముత్తియఁపుముగ్గులిడిరన-మొనసితిమిర।
కలితఘనవీథినక్షత్ర-గణములమరె॥ ౧౨౫

చ. ఆనయముదూరదేశగతుఁ-డైననిజేశునిమేలురాకకై।
గొనకొనియిష్టదేవతలఁ-గొల్వఁగఁబూనిమిళన్మధువ్రతాం।
జననిజదృగ్నిమీలనము-సల్పికరంబును ధ్యాననిష్ఠఁగై।
కొనెనలినీకులంబనని-గూఢరుచిన్ ముకుళించెనబ్జముల్॥ ౧౨౬

చ. అమరెడుసాంధ్యరాగకిస-లాంచితనిర్జరమార్గశాఖికిం।
దిమిరతతుల్పికంబులన-నిండినఖండితకాంతిదారకల్।
సుమములనంగ నెంతయును-శోభిలెఁ బండినపండనంగను।
త్తమనవరాగసంపదసు-ధాకరబింబముదోఁచెనత్తరిన్॥ ౧౨౭

చ. మొనయుచునిండిపారెడుద-మోయమునన్విదళించిదాటుచూ।
ఘనబలుఁడోయనంగశశి-చెంపెసఁగెన్ దివివానివల్వనాఁ।

న్నెలవగు వాఁడు జక్కు-వల-నెచ్చెలిపచ్చగు తాలజోడుగా।
ములయొకిమీఁదుదోఁచెఁజగ-ముల్ గడు వేడుకఁ జెందన త్తరిన్॥ ౧౦౦॥

గీ. వ్యూహరచనఘటించి రఘూద్వహుండు।
బలమునందందఁ దగు భంగిఁ-బదిలపరచి।
కడఁకనిగుడంగ రావణుఁ-గదిసిపోరెఁ।
గలహమపుడయ్యె నారెండు-బలములకును॥ ౧౦౧॥

గీ. మేఘనాదుండు పోరెసౌ-మిత్రితోడ।
రవిసుతుండు విరూపాక్షుఁ-గవిసితాఁకె।
నంగదునితోడఁ ఖర్వటుం-డనియొనర్చెఁ।
జాంద్రకుఁడు సేసె నలునితో-ఘండనంబు॥ ౧౦౨॥

క. పుటశుఁ డనుదనుజవీరుఁడు।
పటుశక్తిం దుర ముఁజేసెఁ-బనసునితోన।
చ్చటదనుజభటులకునుమ।
ర్కటులకునం దటికిద్వంద్వ-కలహంబయ్యెన్॥ ౧౦౩॥

వ. అయ్యిరు దెరంగుల జోదులు మత్సరంబునం గచ్చుకొని పెచ్చుపెరిగి విచ్చలవిడినిట్లు వ్రేట్లాడుచున్నం బోరు ఘోరం బయ్యె ననంతరంబ. ౧౦౪॥

క. ఘోరపరాక్రములగుహరి।
వీరశిఖామణులు బిట్టు-విదళించిననిం।
ద్రారాతిచమూనాథులు।
శూరత చెడి తిరిగి లంకఁ-జొచ్చిరి భీతిన్॥ ౧౦౫॥

ఉ. ఈగతి నాజిలోన బల-మెల్ల వినాశముఁ జెందనంతటన్।
వేగ దశాననుండనుప-విక్రమధుర్యుఁడు మేఘనాదుఁడ।
భ్యాగతుఁడై వలీముఖుల-నంటి నొంచె మహావిషోజ్వల।
న్నాగశరంబు వేసి నర-నాథుల బద్ధులఁ జేసె నీసునన్॥ ౧౦౬॥

క్రొన్నవవిల్తుకేళి నెల-కొన్న సుఖాంబుధినోలలాడుచున్।
సున్నతలీలవేడ్క-కొన-సాఁగఁజరించెఁజకోరదంపతుల్॥ ౯౩॥

వ. ఇట్టిసాంద్రచంద్రికా వికాసనికామ భాసురనిశాసమయంబున.

ఉ. పంబినవేడ్కతోడఁ-కను-పట్టుహిరణ్మయశృంగతుంగసౌ।
ధంబుననున్న రావణునిఁ-దప్పకకన్గొని భానుసూనుఁడు।
ర్వ్యంబడఁద్రోచెదన్మణికి-రీటము వాఁడునుబన్నమందిరో।
షంబునశంకనిల్వక వె-సంజనియెన్వదనంబులోనికిన్॥ ౯౪॥

గీ. అంతసుగ్రీవుతోఁగూర్మి-యనుజుతోడ।
సేనతోఁగూడిరఘువంశ-శేఖరుండు।
కడఁగనగ్గిరిడిగ్గిలం-కాపురంబు।
చెంగటానీకములవిడి-యంగఁజేసె॥ ౯౫॥

వ. అంతజతనంబుగవిడిసిన యవ్వానరవీరులంగవిసిన, ఆయుధపాణులును, మహాకాయులును, సైనికసమేతులునగు రావణానుచరులు పర్వణుండును, పూతనుండును, జృంభుండును, ఖరుండును, క్రోధవశుండును, హరియును, ప్రరుజుండును, అరుజుండును, ప్రహస్తుండును మఱియుం బెక్కురక్కసులుకు మీఱి యదృశ్యులయి పోరుచున్న విభీషణుం డంతర్ధానవధంబుఁ గావించె. బలవంతులగు హరియూథపులు దూరపాతులయి విజృంభించిన రాత్రించరులునిహతులయి పుడమింబడిరవ్వార్తవిని సహింపక రావణుండు.

క. కరమలిగిదనుజసేనా।
పరివృతుఁడైబయలువెడలి-పటుదోర్గర్వ।
స్ఫురణంబుమెరయనతిశిత।
శరములనొప్పించెప్లవ-చరులంబెలుచన్॥ ౯౬॥

వ. అంత. ౯౭॥

చ కలువలదాయముజ్జగము-కన్నువెలుంగులనిండుప్రోసుచు।
కలదారజోడుతమ్మిచెలి-కాఁడుకడానిపసిండిఛాయకు।

సీ. వజ్రదంష్ట్రుండను-వానిపీచమడంచెఁ,
ప్లవగోత్తముఁడుమహా-బలుఁడునలుఁడు।
బహువిధసమరలం-పటునకంపనుబట్టి-
కుముదుండురణభూమిఁ-గూల్చియార్చె।
నతికాయబలమదో-ద్ధతుఁడైనత్రిశిరుని,
సౌమిత్రిదురమున-సమయఁజేసె।
మనుపుగదేవాంత-కునిద్రుంచిపదపడి,
యనసుతుండునరాంత-కునివధించెఁ।

గీ. కుంభకర్ణాత్మజులగాడ్పు-కొడుకుదునిమె।
ఖరునికొమరునిమకరాక్షుఁ-గడఁగిపొడిచి।
పేరణంగించెగరళివి-భీషణుండు।
దురమునకువంతినింద్రజి-త్తుండువచ్చె॥ ౧౧౫॥

క. ఆయింద్రజిత్తుదారుణ।
సాయకములువరపిరామ-సౌమిత్రులస।
ద్గేయచరిత్రులవీరులఁ।
బాయకమోహితులఁజేసె-భండనభూమిన్॥ ౧౧౬॥

ఆ. వాయుపుత్రునివాత-వాజియైయమ్మేటి।
నింగికెగసినిలిచి-నిశితకనక।
పుంఖమానమైన-భూరిశిలీముఖా।
సారములనుగపుల-బీరమడఁచె॥ ౧౧౭॥

క. వ్యోవీధినున్నయారణ।
కోవిదుశరవృష్టినిగిడెఁ-గుముదాంగదసు।
గ్రీవనలజాంబవంతుల।
తోవానరులెల్లఁద్రెళ్లి-దుర్దశనొందన్॥ ౧౧౮॥

క. చేసినయాపిమ్మటవిన।
తాసుతుఁడచ్చోటికతిము-దంబెరఁగఁగ వేం।
చేసెనుపాశవిముక్తులఁ।
జేసెనురాసుతులఁగడువి-శేషప్రీతిన్॥ ౧౦౮॥

ఉ. అందువిభీషణుంగని ప్ర-హస్తుఁడుగొబ్బునడ సియార్చివా।
సిందనరారుఘోరగద-చేఁ బ్రహరించినఁగంశ సిమియుం।
జెందకనిల్చెనద్దనుజ-సింహముశీతనగంబుమాఁ —నా।
చందముఁజూచిడెందముల-జానుగనచ్చెరుపొందిరందఱున్॥

వ. అంత విభీషణుండు. ౧౦౯॥

గీ. అష్టఘంటమహాశక్తి-నడరిపూని।
యలప్రహస్తునిశిరముల-క్ష్యముగ నేసె।
వాఁడునుహృతోత్తమాంగుఁడై-వజ్రపాత।
భగ్నభూజమువలెఁజూడఁ-బడియెనపుడు॥ ౧౧౦॥

చ. అనిమొననట్లుగూలినప్ర-హస్తునిఁగన్గొనిధూమ్రలోచనుం।
డనుబలురక్కసుండతిర-యంబునఁగోతులఁబారఁద్రోలినం।
గినిసిమహీరుహంబుననొ-గిన్ హనుమంతుఁడువానిఁద్రుంచెనా।
జనిహతువానిఁజూచిహత-శేషులులంకకు నేగిరత్తఱిన్॥ ౧౧౧॥

వ. చని వారు సమరవృత్తాంతంబంతయు రావణునితో విన్నవించిన.

మ. అసురాధీశుఁడుకుంభకర్ణునతిని-ద్రాసక్తుమేల్కొల్పిశ।
త్రుసమూహంబువధించఁబంచెనతఁడున్-దోర్గర్వమేపారయు।
ద్ధసముత్సాహముమీఱవచ్చికపులం-దాకెంగృతాంతాకృతిన్।
వెసబ్రహ్మాస్త్రమునస్సుమిత్రకొడుకు-ర్వింగూల్చెనద్దానవున్ ౧౧౩॥

గీ. దూషణునితమ్ములరిభయ-దూరమతులు।
వజ్రదేహప్రమాదుల-న్వారుగాడ్పు।
కొడుకుచేనీలుచేఁద్రుంచఁ-బడిరిపత్త్రి-।
వనసమదిలోనఁగలుసుదు-ర్దమదొలఁగ॥ ౧౧౪॥

కోపమే పారదుర్వార-ఘోరబహుళ
కాండములఁ జెండె వెనట లక్ష్మణుండు వాని॥ ౧౨౫

క. మనుజక్రికి బ్రహ్మామున
కును వోలె మహావిచిత్ర-ఘోరతరాయో
ధనమయ్యె సుమిత్రాత్రిచ
దనుజకున మేఘనాదు-నకునచ్చోటన్॥ ౧౨౬

ఉ. అంతనిసర్గదుర్గమభు-జార్గళదక్షుఁడు లక్ష్మణుండు క
ల్పాంతకృతాంతభీషణుడు-రంతమహోగ్రతఁ జేర్చి ఖేచరుల్
సంతసిలం దృతీయదివ-సంబున సంగరభూమిఁ గూల్చెదు
ర్దాంతపరాక్రమక్రమవి-ధానవినోదుని మేఘనాదునిన్॥ ౧౨౭

వ. అంత ఖరాంతకుండు మూలబలంబులం బొలియించె నిట్లు లక్ష్మణునిచేత నింద్రజిత్తు బొలియుట హతశేషదోషాచరులవలన విని రావణుండు కోపంబుతోడఁ బుడమికన్నియం ద్రుంచ నుద్యోగించి పెద్దలచే నివారించంబడి మగుడి నిబిడసమరసన్నాహసాహస సముత్సాహదోహలుండై వెండి మణిగణప్రముఖ వైజయంతికా విరాజమానంబును, తప్తచామీకర మాలికా జాలకావృతంబును, తరుణారుణప్రభాభిరమణీయంబును, సకలశాస్త్రాస్త్రశోభితంబును, మహాజవ బహుతురంగసమేతంబును, రత్నకింకిణీనాద మేదురంబును, మహోదారసారథికంబును నగు నొక్క దివ్యరథంబెక్కి సముద్దండకాంచనకోదండధరుండై ప్రచండమండలాగ్ర ముసల ముద్గర పరశు పట్టిస పరిఘ గదాశూల భిండివాల ప్రాస శరశరాసన చక్రాది ప్రహరణప్రాణులును, శతాంగ మాతంగ తురంగ సింహ శార్దూల శరభ వరాహాది మృగవాహనారూఢులును, ప్రళయసమయ సమారంభ సంరంభ సముజ్జృంభణ కుంభ దంభోధర గంభీర నిర్ఘోష ప్రతిభటచటుల వికటాట్టహాస భాసుర కఠోర కంఠహుంకారములును నగు నసంఖ్యాతయాతు

వ. ఇత్తెరంగున నింద్రజిత్తుండు తత్తరంబునం గోతిమొనగాని మొత్తం
బులతోడ నయ్యుత్తమపేసుల నత్తిరివిపత్తినొందించి వియత్తలంబు
ననంతర్హితుండయ్యె నంత. ౧౧౯॥

చ. ఎలమి విభీషణుండు మిథి-లేశసుతాపతికిం బ్రణామముల్।
బలుమరు నాచరించి తగఁ-బ్రాంజలియై పలికె న్మహాత్మజ।
క్షులయొకిమోని యానతిని-గుహ్యకుఁడీతఁడు మంత్రపూతమౌ।
సలిలము నీదు పజ్జకు వె-సంగొనివచ్చినవాఁడు భూవరా॥ ౧౨౦॥

క. హితవృత్తి మెరయ నంత।
ర్హితభూతవిలోకనార్థ-మిజ్జలమెసఁగెన్।
ధృతినీకు ధనేశ్వరుఁడా।
శ్రితరక్షక నేత్రశుద్ధి-సేయుము దీనన్ ౧౨౧॥

వ. ఇట్లు గావించిన నంతరిక్షంబున నంతర్హితంబులైన భూతంబులు నీ
కు దృష్టిగోచరంబులగు నెవ్వారికెవ్వారిం గృపసేయుదు నవ్వార
లును గగనంబున నంతర్హితంబులగు భూతంబులం జూతురని విభీ
షణుండు విన్నవించిన ౧౨౨॥

శా. ఆతోయంబుఁ బరిగ్రహించి రఘువం-శాధీశుఁ డెంతేనియుం।
జేతఃప్రీతిని నేత్రశుద్ధియొనరిం-చెన్ లక్ష్మణుండున్ సగో।
జాతాస్త్రప్రియపుత్త్రుఁడాదియగు కీ-శశ్రేష్ఠులున్ హాళిమై।
సీతావల్లభదత్తమంత్రజలసం-స్పృష్టాక్షులై రందఱున్॥ ౧౨౩॥

క. రవిసంభవహనుమజ్జాం।
బవదంగదనీలగంధ-మాదనమైంద।
ద్వివిదాదికపులు గాంచిరి।
దివినణఁగిన యింద్రజిత్తు ధీరోదాత్తున్॥ ౧౨౪॥

గీ. అంతట నభోంతరంబున-నణఁగియున్న।
యింద్రజిత్తును బాడగాంచి-యదరిపాటి।

వ. అట్లు పురందరస్యందనారూఢుండై దశరథనందనుండు దశముఖునకభిముఖుండైనడచె నట్లెదురుకొని యద్దనుజేంద్ర మనుజేంద్రులిద్దఱుం బరస్పరవిజయాభిలాషంబుల నశేషదివ్యాస్త్రశస్త్రంబుల నతివిచిత్రప్రకారంబునం బోరిరంతయుగాంత భీషణుండు యుగాంతకుపితకృతాంతభీషణుండును నిదాఘసమయ మధ్యాహ్నమార్తాండ దుర్నిరీక్ష్యుండును త్రిపురసంహరణ ప్రచండఖండపరశుమహారౌద్రుండునునై రామభద్రుండు గిరిభేదనంబు సరిచ్ఛోషకంబు నరణ్యదాహకంబు నశనిజనకంబు గ్రహభుజనంబు జ్యోతిర్మయంబు, మహానిష్ఠురంబున ప్రతిహతంబు దూరపాతియు, దుర్నిభావ్యంబు, శత్రుసూదనంబు, బలకరంబు, జయదాయకంబు, సర్వాస్త్రరాజంబు, నత్యుత్తమసాధనంబు, సమంత్రకంబునగు, బ్రహ్మాస్త్రసాయకంబు రావణవధార్థంబు చాపంబున సంధించిన.

మ. క్షితిగంపించె సముద్రముల్గలఁగె మ్రొ-గ్గెన్ దిగ్గజశ్రేణిప
ర్వతసంఘంబు వడంకె మిన్ను మొరసెన్-రాలెన్ మహోల్కాతతుల్
గతిదప్పెన్ గ్రహపఙ్క్తి-క్షింబడియెను-గ్రస్ఫీతనిర్ఘాతముల్।
దితిజవ్రాతము నేలఁగూలెఁగవసెన్-దిగ్ధూమము ల్వెల్లుగన్॥ 133

వ. ఇట్లతిరౌద్రరసావిర్భావ దుర్భరంబుగా బ్రహ్మాస్త్రంబు వింటసంధించి వారాశిబంధించిన యాధనుర్ధరాగ్రేసరుండు రావణాసురుని శిరంబవలీలద్రుంచి విజయలక్ష్మీసమేతుండై తేజరిల్లెనంత దిక్కులు వికాసంబునొందె సురభిశీతలమంద పవనంబులొలసె నాదిత్యాదిగ్రహంబులు ప్రకాశించె. లోకంబులు నిర్భీకంబులయ్యె. పురందరాది బృందారకులమందానందంబు డెందంబులం గ్రందుకొన దేవదుందుభిధ్వానపూర్వకంబుగాఁ బుష్పవర్షంబు గురిసె గంధర్వగానంబు చెలంగె రంభాదిసురాంగనాలాస్యప్రసంగంబు రాణించె సిద్ధమునిచారణవిరచితాశీర్వాదనాదంబులు భోరుకలంగె. ఈప్రకారం

ధానసైనికులు బలసి పరివేష్టించి కొలువ, హేషాగంధసింధుర బృంహిత దనుజ వీరభట సింహనాదంబులు భేరీమృదంగ శంఖ కాహళ ప్రణవ గోముఖాది మహావాద్య ధ్వానంబులతోడ నేకీభూతంబులై భూనభోంతరంబులు నిండింప నఖండిత త్వరాహంకారపరాభూతమాతరిశ్వ మహాశ్వ నికర ఖురపుట నిర్దళిత ధరాపరాగపటలంబు లంబుజాప్తబింబకబళనంబొనర్ప, సూతమాగధ వందిసందోహ సముచ్చార్యమాణ జయజయశబ్దంబులు చెలంగ నభంగుర సంగరోత్కంఠుండై దశకంఠుండు పురంబునిర్గమించి నడచె నయ్యెడం గడు దుర్నిమిత్తంబులు వొడమె నవి సరకుగొనక కఱకుదనంబున నురువడించి చని రణవేదికా ప్రజ్వలన్మహాజ్వలనంబుపోలె నున్న యన్నరేంద్ర సార్వభౌమునిం జూచి కడియనడిచె నయ్యవసరంబున. ౧౨౮॥

చ. సురమునిసిద్ధసాధ్యబల-సూదనలోకనివాసమేదినీ।
శ్వరవృషభుల్ ప్రభాతరవి-సన్నిభహేమవిమానకాంతి వి।
స్ఫురణమునన్ దిశల్వెలుఁగ-భోరనవచ్చినభంబునందుని।
ల్చిరిదశకంఠుతోడనని-సేయనజేయునిరాముఁజూడఁగన్ ౧౨౯॥

ఉ. ఆతరిమాతరిశ్వహృద-యాతిగవేగహరిత్తురంగమో।
పేతమరాతిభీమముహి-మేతరభానువిభాప్రభావవి।
ఖ్యాతమునౌరథంబుకడ-కన్ బలశాసనుశాసనంబునన్।
మాతలిదెచ్చెమెచ్చఁగక్షు-మాతలసాధకులేంద్రుచెంతకున్॥౧౩౦॥

ఉ. భూతలభర్తయెక్కెఁ-పరి-భూతసమీరతరస్తురంగము।
ద్ద్యోతరథాంగమున్ మణిశి-లోచ్చ్రయభాసురశృంగతుంగమున్।
కేతుపటానిలోద్భవద-కించననాకధునీతరంగము।
జ్జాతహితోపమానరుచి-సంగముసజ్జరరాల్చతాంగమున్॥ ౧౩౧॥

ఘోరబాహుసుబాహుసం-హారునకును।
బ్రణతులొనరించెదము నీకుఁ-బరమపురుష॥ ౧౪౦॥

క. గౌతమపాణిగృహీతీ।
పాతకమోచనవిధాన-పటుతరపదకం।
జాతస్మితపరాగ।
ప్రీతునకాద్యునకు నీకు-వందనమభవా॥ ౧౪౧॥

గీ. ఖండపరశుశరాసన-ఖండనునకు।
జనకకన్యాకరగ్రహోత్సవకరునకు।
భార్గవవినిర్గళాగ్రహ-భంజనునకు।
నంజలిపుటించెదము సరో-జాక్షనీకు॥ ౧౪౨॥

గీ. ఎలమిఁ గైకకువరయుగం-బిడినతండ్రి।
పలుకు నిక్కము సాలింప-భార్యతోడ।
ననుఁగుసైదోడుతోడగా-ననము జేరి।
నిలిచినగుణాంబురాశికి-నీకుశరణు॥ ౧౪౩॥

సీ. భరతసంప్రార్థనా-బలదత్తపాదుకా,
ద్వయునకు శరభంగ-తాపసేంద్ర।
సురలోకసంప్రాప్తి-కరునకు సాధువి,
రోధివిరాధని-రోధకునకు।
ప్రాప్తగృధ్రకులాది-రాజసఖ్యునకును,
మాయావిమారీచమర్దనునకు।
బాహుమదాంధక-బంధఛేదనునకు।
శబరిసమర్చిత-చరణునకును।

గీ. వానరాధీశసఖునకు-వాలివధవి।
ధాయికినగాధసింధుబం-ధనునకఖిల।
రాక్షసవినాశకరునకు-రావణాంత।
కునకునభివాదనము నీకు-వనజనాభ॥ ౧౪౪॥

బున రావణసంహారంబు గావించి విభీషణునకు లంకారాజ్యపట్టాభిషే
కంబు సేయించి సురగరుడగంధర్వకిన్నరసిద్ధసాధ్య విద్యాధరత
పోధనసమన్వితుండును సుగ్రీవాదివానరవీరసైనిక పరివృతుండు
ను సీతాలక్ష్మణసహితుండును నై పుష్పకంబెక్కి యకౌసల్యాసూ
నుండు సకలజగజ్జేగీయమానపుణ్యశ్లోకమరంధరుండై గంధమాద
నపర్వతంబునకుం జనియందు॥ ౧౩౪॥

క. సురమునిసన్నిధి రాముఁడు।
తిరముగ శోధించినపుడు-త్రిజగత్ఖ్యాతం।
గరుణోపేతంగోమల।
చరణసరోజాతనవని-జాతన్ సీతన్॥ ౧౩౫॥

వ. అంత॥ ౧౩౬॥

శా. సీతాలక్ష్మణసంయుతున్ వికచరా-జీవాక్షు భాశ్వత్తనూ।
జాతాదిప్లవగాన్వితున్ దివిజసం-సత్పూజితుం దాపసో।
పేతున్ రామునిరావణాంతకు గుణా-బ్ధిన్ దండకారణ్యవి।
ఖ్యాతావాసులు చూడవచ్చిరి మునుల్-కౌతూహలంబొప్పఁగన్॥

గీ. వచ్చి మౌనులు జయజయ-ధ్వనులు చెలఁగ।
రాముని నభిరాము జానకీ-రమణుఁ గాంచి।
యెదుట కుంభంబు నిడుకొని-హృదయవీధి।
నింపు వెలుఁగొత్త నుతి జేసి-రివ్విధమున। ౧౩౭॥

గీ. జగదనుగ్రహకారికి-శాశ్వతునకు।
జగము రావణ మొనరింప-జగతియందు।
నవతరించినవారికి-వారికి రాము-
చంద్రునకు మ్రొక్కెదము నీకు-జలజనాభ॥ ౧౩౮॥

గీ. తాటకాంతకునకు గాధి-తనయయాగ।
పాలునకు దుష్టమారీచ-భంజనునకు।

సీ. అంతరాఘవుఁడు సం-యమిపుంగవులకు సా,
ష్టాంగ ప్రణామంబు-లాచరించి।
సమధిక భక్తినం-జలిపుటంబు ఘటించి,
యిట్లని పల్కెము-నీంద్రులార।
సంశుద్ధికై సర్వ-జనసంఘములకేను,
బ్రాప్యుఁడ మద్దృష్టి-పథముఁ జేరు।
జంతువు మోక్షభా-జనము సందియము లే,
దైన నిచ్చలు నిర-హంకృతులను.

గీ. స్వాత్మలాభసంతుష్టుల-నధికశాంత।
చిత్తులను సర్వభూతసు-హృత్తములను।
దాంతులను విప్రులను సర్వ-దా భజింతుఁ।
బ్రేమమిగుల రోత్తబ్రాహ్మణ-ప్రియుఁడనగుట॥ ౧౫౧॥

క. మిమ్మొక్కటి యడిగెదఁ జి।
త్తములఁ జింతించి నిశ్చి-తము జేసి గతా।
హ్మతులార వచింపుఁడు।
సమ్మదమున నాకు మీరు-సౌహార్ద్యమునన్॥ ౧౫౨॥

గీ. పక్షికంధరవధమునఁ-బాపమెద్ది।
గలిగె నాయందు నమ్మహా-కలుషమునకు।
నిష్కృతి వచింపుఁ డెద్దాని-నేనొనర్చి।
పాపముక్తుఁడనగు మనో-భవ్యులార॥ ౧౫౩॥

వ. అని యడిగిన నమ్మహాత్మునకమ్మహామును లిట్లనిరి. ౧౫౪॥

గీ. నిత్యసత్యవ్రతాచార-నిగమవినుత।
లోకరక్షాధురంధర-లోకనాథ।
కలుషసంహారలోకోప-కారముగ శి।
వార్చనము సేయు మంబుజా-తాయతాక్ష॥ ౧౫౫॥

ఉ. ఏపున గంధమాదనమ-హీధరశృంగమునం దులింగసం।
స్థాపన మాచరింపు దురి-తవ్రజశాంతికి లోకసంగ్రహా।

క. దారుణసంసారార్ణవ।
తారకపాదారవింద-దానవివత్సం।
హారజగదేకరక్షణ।
కారణమొక్కెదమునీకుం-గరుణాజలధీ। ౧౭౫॥

గీ. భక్తరక్షణదీక్షితపరమపురుష।
సచ్చిదానందవిగ్రహ-సర్వజనక।
నామరూపకజనదోష-నాశయీశ।
కేశవనిరీశమమ్ముర-క్షించుమభవ॥ ౧౭౬॥

క. రక్షారక్షితదశముఖ।
రాక్షసునివధించిజగము-రక్షించితిసా।
పేక్షణమమురక్షింపుము।
రక్షింపుములోకనాథ-రఘుకులతిలకా॥ ౧౭౭॥

వ. ఇట్లుస్తోత్రంబుచేసిసకలమునులూరకుండిరి. ఈరామస్తోత్రంబు త్రిసంధ్యంబు భక్తిపూర్వకంబుగాఁ బఠించువాఁడు భుక్తిముక్తులువడయు. ప్రయాణకాలంబునఁ బఠించువానికి భయంబునివర్తించు. భూతప్రేత భేతాళగ్రహంబులునశించు. సకలలోకబాధలడంగు॥ ౧౭౮॥

గీ. పుత్త్రకాముఁడుగాంచుస-త్పుత్త్రుగుణుల।
కన్యచక్కనిపతిఁబొందు-ఘంతమెఱయ।
మోక్షకాముఁడుగన్గొను-మోక్షపర।
కాముఁడగువాఁడుజెందుఁబు-ష్కలధనంబు॥ ౧౭౯॥

క. ఈరామస్తవరాజం।
బారూఢిఁబఠించునట్టి-యనఘాత్ములకుం।
గోరికలెల్లలభించును।
శ్రీరామస్వామికరుణ-చేననిశంబున్॥ ౧౮౦॥

వ. భుజాస్ఫాలనంబుఁ గావించి సురగరుడగంధర్వకిన్నరసిద్ధసాధ్య
విద్యాధర తపోధనపుంగవులు గనుంగొనుచుండ నుద్దండవేషం
బైయకాండజలింపం జేయుచు నభోమండలంబున కెగసి యా
కాశమార్గంబులఘుంప్రచుం జనిచనియుండెట. ౧౬౩॥

మ. కనియె న్స్వాయతతుంగశృంగశశిరే-ఖాశేఖరావాసముఁ।
గనదుద్యచ్చరదభ్రవిభ్రమతర-స్ఫారిస్ఫురద్భాసముఁ।
ఘనరత్నజ్వలదంతికస్థలపరి-ష్కారత్తుషారాద్రినం।
దని కాలక్షకరక్షకప్రమదవి-న్యాసంబు కైలాసముఁ॥ ౧౬౪॥

వ. మఱియును వేయంచుకొండ చండభానుమండలాతిక్రమణరమణీయత
రాగ్రశిఖరనిర్గతముఖరనిరర్గళనిర్ఝరశతంబులచేతను పారిజాతమ
హీజాతసంజాత సమంజస కుసుమమంజరీ పరిచ్యుతమకరందకు
ల్యాకూలకల్పితానల్పచింతామణి వేదికాజాలఖేలత్కిన్నర సుం
దరీబృందంబులచేతను లాస్యప్రసంగతలాసికి విలాససాదృశ్యమా
నసానుగతజీమూతమాలికామేదుర సౌదామినీలతాసహస్రంబుల
చేతను, రుచిరవిచిత్రమణిమరీచికాకందళసంతోషతుందిల సుంద
రీమందిర రంగత్తురంగవదనకురంగనయనాసముచ్చార్యమాణపంచ
బాణవిరోధివిజయగాథాప్రబంధబంధుర మాధురీధురంధరవీణా
క్వాణంబులచేతను, స్నానార్థసమాయాత సప్తమాతృకాచరణా
రవింద విన్యాసధన్యతరసురతరంగిణీతీర హిరణ్మయవాలుకాప్ర
దేశంబులచేతను, హిమవన్నగరాజన్యకన్యకాపీనసమున్నతనిస్తుల
స్తనమండలన్యస్తకస్తూరి పంకిలజలపూరనీరజాకర విశేషంబులచే
తను, సకలదిగ్వలభిదుర్భవనిర్భరారావంతకంఠ నాదమహోత్తుంగ
పుంగవేంద్ర నిశాత విషాణకోణవిశృంఖల సంఘాతనితంబమణి
ఖనిప్రభాభాగధేయంబులచేతను, గంధసింధురవదనకుండాదండ
క్షితప్రోజ్ఝితనిలింపతటినీజలచ్ఛటాపటల పాతనిరుద్ధగగనపథపతి
మారవిస్ఫురత్పథికవైమానిక నికరంబులచేతను, సుధారసవాపికా
పూరిత కాంతసంతానపానపవిత్రలచ్ఛాయాయాతల యక్షమృగాక్షీ

వ్యాపృతబుద్ధివైధవళ-వారిజలోచనశంభులింగసం।
స్థాపనజన్యపుణ్యము వి-ధాతకు నైన వచింపశక్యమే॥ ౧౪౬॥

గీ. శ్రీలు మెఱయ భవత్ప్రతి-ష్ఠితమహీశ।
లింగదర్శనమున జనా-ళికలభించుఁ।
గాశిశివలింగదర్శన-కలనకంటెఁ।
గోటిగుణితఫలంబు సద్గుణపయోధి॥ ౧౪౭॥

క. ఈలింగము నీనామము।
చేలోకమునం బ్రసిద్ధిఁ-జెందు న్విపదా।
భీలాంహోహాగహనోగ్ర।
జ్వాలానలము గుచు సాధు-జనసులభంబై॥ ౧౪౮॥

క. రామేశ్వరనామంబున।
సీమహినీమహితలింగ-మిమ్ముగ వెలయున్।
రామువిలంబము సేయక।
నేమముగ శివప్రతిష్ఠ-సేయుము నెమ్మిన్॥ ౧౪౯॥

క. అనినవిని పుణ్యకాలము।
జనపతి ద్వైముహూర్తముగ వి-చారించి ప్రభుం।
జనతనయుని నెనరెనయం।
దఁ చెంతకుడాయఁ బిలచి-తగ నిట్లనియెన్॥ ౧౫౦॥

గీ. ఆంజనేయ హనూమంత-యనిలతనయ।
శంభుపదముగు కైలాస-శైలమునకుఁ।
బొరిమనోవేగశాలివై-పొమ్ము సంప్ర।
తిష్ఠ సేయంగ లింగంబుఁ-దెమ్ము నీవు॥ ౧౫౧॥

క. పతియిట్లాజ్ఞాపించిన।
నతిశయముగఁ బుణ్యకాల-మతిఁడు ముహూర్త।
ద్వితయవ్యవధానముగా।
మతినెఱిఁగి ప్రహసమాన-మానసుఁడగుచున్॥ ౧౫౨॥

బయ్యోనికమించిచనునీ।
వియ్యోవఁదడవేలచేసె-దినకులతిలకా॥ ౧౬౬

గీ. పావనాచారజానకీ-దేవియొద్ది।
లీలఁగావించెవాలుకా-లింగమిచట।
నిదియనీవుప్రతిష్ఠింపు-మిపుడుదీని।
కంటెనుత్తమమైన లిం-గంబుగలదె॥ ౧౬౭

క. అనిమునులువిన్నవించిన।
వినిజానకితోడరామ-విభుఁడెలమినిగ్రా।
కుర్వనిత్తరిఁగృతమంగళ।
ఘనకౌతుకుఁడగుచుమౌని-గణములతోడన్॥ ౧౬౮

వ. జ్యేష్ఠమాససితపక్ష దశమీ సౌమ్యవారంబున హస్తనక్షత్రంబున వ్యతీపాతయోగంబునం, గన్యయందుఁజంద్రుండు, వృషభంబున సూర్యుండునుండ నిట్టి దశయోగ పుణ్యకాలంబున సేతు మధ్యంబున గంధమాదనపర్వతంబునందు. ౧౬౯

ఆ. నిలిపెరాఘవుండు-నీలకంధరునిలో।
కైకగురుని వాంఛి-తార్థకరుని।
చంద్రశేఖరునిన-గేంద్రకన్యామనో।
హరునిలింగమూర్తి-ధరునిహరుని॥ ౧౭౦

క. లింగస్థితునీశానున్।
గంగాధరునభవునీల-కంధరుగౌరీ।
సంగతునిఁబుంగవేంద్రతు।
రంగునిశివుఁబూజచేసె-రఘుపతిభక్తిన్। ౧౭౧

ఆ. అంతలింగమూర్తి-యందునిల్చినసాంబ
శంకరుండుకడుఁబ్ర-సన్నుఁడగుచు।
రాఘవునకులోక-రక్షకునకువరం।
బిచ్చెఁగరుణవెలయ-నిర్విఘ్నమునను॥ ౧౭౨

కల్పితసురతాంతిమ శ్రమాపనోదక నవకిసలయతల్పంబులచేతను తరుణారుణకిరణసంతతి ప్రతిమల్లపల్లవసముల్లసద్బిల్వ తరువాటికాంతరనిరంతర పురాంతక చింతనామృతరసానుభవపులకితప్రతిక యోగికులాగ్రగణ్యులచేతను నికుంభకుంభోదర భృంగిరిటాది మహాప్రమథపరిచారక నిరంతరసంతాడ్యమానఢక్కా డమరుడిండిమపటహపణవాదివాదిత్ర నాదసంగతమారుతపూరితమహాఘోషంబులచేతను, పంచబ్రహ్మపంచాక్షరప్రముఖనిఖిలశైవమంత్రరాజజపానుష్ఠాన నిష్ఠోత్సుకశుకపికశారికామయూర సమాశ్రితవితతవివిధవాసనానాథసకలర్తు ప్రత్యగ్రప్రసూన పరిష్కృతలతావితానపరిరంభసంభోగ సుఖాలసమలయపవనసంచారసమంచితోపవనంబులచేతను, ప్రియాంగనాభుజాలింగితకంధరగంధర్వపాణిపంకజపరిగృహీతయాతాయాతజాతరూపడోలికాపాశపరిణద్ధవిటపవిలసదనిమిషతరువాటికానికామ రమణీయాధిత్యకాభాగంబులచేతను, నభిరామంబై పార్వతీపరమేశ్వరయశోరాశియుంబోలెఁ బ్రకాశించు కైలాసపర్వతరాజంబు దర్శించి రోమాంచకంచుకితశరీరులై అనేకదండప్రణామంబులు గావించియందులింగరూపధరుండైన మహేశ్వరుండు దృష్టిగోచరుండు గాకున్న మరున్నందనుండు ప్రాగగ్రకుశాసనసమాసీనుండును, ఊర్ధ్వబాహుండును నిరాలంబుండును, నిరుచ్ఛ్వాసుండును, జితేంద్రియుండునునై తపంబుగావించి పరమేశ్వరునారాధించి ప్రసన్నునింజేసి లింగంబువడసి నంతలోఁ దత్త్వవేత్తలగు మహామునులు హనుమంతునాగమనంబు లేమియుంబుణ్యకాలంబు స్వల్పావశిష్టంబగుటయు నెఱింగి రఘుపుంగవునితో నిట్లనిరి. ౧౬౫॥

క. అయ్యా హనుమంతుఁడు రా
డయ్యెను మఱి పుణ్యకాల మతిసన్నిహితం

నురుసిష్ఠావిభవానుషక్తమతులై-యొక్కొక్కలింగంబుని
ల్పిరి సేతుస్థితగంధమాదనమహా-పృథ్వీధరేంద్రంబునన్॥ ౧౭౯॥

గీ. ఇట్లు వివరించితిని మైథిలీశకృతమౌ
రప్రతిష్ఠాపనప్రకారంబు మీకు
నిదపఠించినవినన రామేశలింగ
సేవన ఫలంబు మోక్షంబుఁ జెందునరుఁడు॥ ౧౮౦॥

వ. అని సూతుండు చెప్పిన విని శౌనకాదిమహర్షులు తదనంతర కథావి
ధం బెట్టిదని యడిగిన ౧౮౧॥

మ. వనిక్షేపతటాకదేవగృహశా-వ్యబ్ధిప్రతిష్ఠోద్వాహన
దనసంజ్ఞాసముదగ్రసప్తవిధసం-తానస్వతంత్రార్థ్యమ
ల్లనమంత్రీశ్వరమానసాంబురుహషట్-లాలోలరోలంబకాం
చనగర్భాదిసుపర్వరక్షణకళా-జాగ్రత్కృపావీక్షణా॥ ౧౮౨॥

క. పశ్యల్లలాటదురితా
వశ్యాయసహస్రకిరణ-వర్ష్మాకారా
భర్గిశ్యామలకంధరదృ
గ్దృశ్యపరిజ్ఞానవేద్య-దివ్యాకారా॥ ౧౮౩॥

## భుజంగప్రయాతము.

ఫణిస్వామిమంజీర-భాస్వత్పదాబ్జా
రణక్షోణినిర్యాత-రాత్రించరౌఘా
గణేశాదిశైవాగ్ర-గణ్యాభినంద్యా
గుణీభూతదృక్కర్ణ-గోత్రేంద్రచాపా॥ ౧౮౪॥

ఉ. భూతలనాథచంద్రరఘు-పుంగవనిశ్చలభక్తినిందునీ।
క్షేత్రప్రతిష్ఠితంబయిన-శ్రీశివలింగముఁ జూచియున్నవా।
పాతకులైనవారికిని-బాపములెల్ల వినాశమొందుఁగ।
జ్ఞాతహితప్రకాశమున-సంతతమసంబులణం మెకైవడిన్॥ ౧౭౩॥

గీ. మనుకులేంద్రప్రథమకో-టి మజ్జనమున।
రామనాథేశలింగద-ర్శనమువలను।
నావిదుస్తరదురితము-ల్విలయమొందు।
సత్యమీవచనంబుసం-దేయము లేదు॥ ౧౭౪॥

క. ఇత్తెరఁగువినత్తరనిమ।
హత్తరమువపరమొసంగి-యభవుఁడుహిమభూ।
భృత్తనయేశుఁడురవిభవం।
శ్రోత్రములకు రాఘవునకు-మున్నతరకరుణన్॥ ౧౭౫॥

క. అందముగ రామనాథుని।
ముందటనందీశుఁబ్రముఖ-ముఖ్యమహింతా।
నందప్రమునిలిపెనత।
స్కందానందనుఁడువిబుధ-లభినందింపన్॥ ౧౭౬॥

క. ప్రాకటముగనీశ్వరునభి।
షేకార్థముచాపకోటి-చేనాపుణ్య।
శ్లోకుఁడుధరభేదించిము।
హాకుండంబొక్కటిజేసె నచ్చటనంతన్॥ ౧౭౭॥

క. తజ్జలములఁగొనిశివునకు।
మజ్జనవిధిసలిపె రామ-మనుజేంద్రుఁడుక్షే।
మజ్జనముతమత్రీర్థము।
సజ్జనవరులాకోటి సంజ్ఞనహించెన్॥ ౧౭౮॥

మ. సురలున్ సిద్ధులుసాధ్యులున్మలుయ-క్షుల్ నాగగంధర్వకి।
న్నరవిద్యాధరులప్సరోగణము నా-నావానరుల్ హాలితో।

క. ఆవెనుకఁ లక్ష్మణుసు
గ్రీవులకుఁ మ్రొక్కి-యతఁడు-కృతమతిసీతా
దేవీ సైకతలింగము
ప్రేవెలయఁగఁ బూజసేయు-శివభక్తినిధీ॥ ౭౧॥
ఆ. మునిసమేతు రాఘు-వునిఁజూచికోపంబు
గెరలఁబరమఖేద-ఖిన్నుఁడగుచుఁ
దనపరిశ్రమంబు-పనిలేక చెడుటకు
వగచిన్నపుసకనియె-వాయుసుతుఁడు॥ ౭౨॥
సీ కేవలక్లేశభు-క్తికినైజగంబునఁ,
బుట్టినాడను నేను-భూతలేంద్ర
యుకుక్కమీఱినపెక్కు-రక్కసిమూకచే,
ననిలోనఖిన్నుండ-నైతిమిగుల
జగతినొకానొక-సరసిజాతాక్షియుఁ,
గనదుగానావంటి-కాన్పునెచట
భవసాగరంబులో-పలమునింగియనంత,
బాధలకెల్లఁబా-ల్పడితినహాహా
ఆ మున్ను సేవజేసి-ఖిన్నుండనైతిని
కలహభూమిఁజాల-కష్టినైతి
నమితదుఃఖరాశి-నైతినీచేఁత,
మానమొందియిపుడు-మనుజులేంద్ర॥ ౭౩॥
క. సేవించెభార్యకైసు
గ్రీవుఁడునిను రాజ్యసిద్ధి-కిసేవించెన్
రావణునితమ్ముఁడూరక
సేవించితి నేనుభక్త-సేవదినిన్నున్॥ ౭౪॥
క. వానరుల నేకులుండఁగ
నేనాజ్ఞాపించఁబడితి-నిచేశవలెం

గద్య:— ఇది శ్రీమదుమామహేశ్వర కరుణాకటాక్షవీక్షాపాత్ర, యేనుగ లచ్చయామాత్యపౌత్ర, తిమ్మనామాత్యపుత్త్ర, వివిధ విద్వజ్జనవిధేయ, లక్ష్మణకవినామధేయ ప్రణీతంబయిన రామేశ్వరమాహాత్మ్యంబను మహాప్రబంధమునందు
ద్వితీయాశ్వాసము.
శ్రీ. శ్రీ. శ్రీ.

శ్రీరస్తు.

# రామేశ్వరమాహాత్మ్యము.

## తృతీయాశ్వాసము.




రుచిరకలశజలధిగ।
భీరోన్నతభద్రిరాజు-భీమాగ్రతనూ।
జారాధితచరణకృపా।
పూరితగురజానపల్లి-పురమల్లేశా॥ ౧॥

వ. అవధరింపుము శౌనకాదిమహర్షులకు సూతుండిట్లనియె. ౨

చ. ఇటువలె రామచంద్రుఁడుమ-హేశ్వరలింగము నిల్పనంతటం।
బటుజవశాలియైనహను-మంతుఁడు రాప్యనగంబునుండియుఁ।
త్కటగతి రెండులింగములు-దైకొనివచ్చికుతూహలంబుని।
వ్వటిలఁగఁ జేరిమ్రొక్కెరఘు-వర్యునకుఙ్ ధరణీతనూజకుఙ్॥ ౩॥

ఆ. మహిని జాతజాయ-మానమ్మృతప్రాణి|
వస్త్రంబునాత్మ-వర్తనంబు|
నంతరంగశీమ-నంతయు నెఱుఁగుదు|
నెల్ల వేళలందు-నిదతేజ ||౧౫||

ఆ. పుట్టు వెఱుఁగుచుండుఁ-బొలియునొక్కఁడనర|
కంబుఁ జెందు జనుఁడు-కర్మగతిని|
పరమపుణ్యశీల-పరమాత్మఁ జెప్పుడు|
నిగ్రహించుసుమ్ము-నిత్య మహిమ ||౧౬||

సీ. ఇట్టితత్వము నిశ్చ-యించి శోకము మాను,
మగచరవీరని-రంజనంబు|
లింగత్రయవిముక్త-ముం గేవలము నిరా,
శ్రయము ను నిర్వికా-రంబు జ్యోతి|
రాత్మకంబును నైన-యాత్మను దర్శింపు,
మాత్మబోధనిరోధ-మైన శోక|
మేలచేసెదవు నీ-వెల్లకాలముఁ దత్వ|
నిష్ఠఁ గైకొనుము ని-ర్నిద్రదృష్టి|

గీ. ఆత్మచింత యొనర్చు దే-హాదికమున|
మమత విడువుము ధర్మంబు-మట్టుపరము|
మనఘమానము పాలింపు-మనము సాఘు|
జనుని సేవింపుమింద్రియా-జయముఁ గనుము ||౧౭||

క. పరనింద సేయకుము హరి|
హరముఖ్యసమస్తదేవ-తార్చనము నిరం|
తర మొనరింపుము సుగుణా|
కర పలుకుము సూనృతంబుఁ-గలకాలంబున్ ||౧౮||

ఆ. తా మబ్రహ్మమగుట-తత్వంబెఱుంగమి|
ప్రబలమగు మహామోహ-భరము గ్రమ్మెఁ|

గానయు నారము రౌప్యము।
హానగమునకు దగుమనుచు-నంబుజనయనా॥ ౯॥

శా. కైలాసాద్రికి జానకీరమణకీ-ర్ఘుంబేగి లింగాకృతిన్।
ఏలన్ గ్రీవుని నందుఁ గానకతపో-నిష్ఠన్మహాదేవునిన్।
బాలేందూజ్జ్వలవక్త్రశోభితుని సాంబశివునిన్-ఫాలాక్షు మెప్పించినే।
హాళిందతత్కృపలింగముంబడసియు-య్యానవచ్చితిన్ గ్రక్కునన్।

క. ఇతరంబగు లింగము నై।
కతమునఁ గావించెదేవ-గంధర్వముని।
ప్రతితులతోడన్ సత్యా।
ప్రతియిటు బూజింపుమన్న-వాఁడవుకడఁకన్॥ ౧౦॥

గీ. దేవరజితాద్రినుండి నా-తెచ్చినట్టి।
యీ మహేశ్వరలింగము-నేటికహహ।
యవనిలోమంద భాగ్యండ-నైననాదు।
తనువు భారంబునకయవ-తారమొందె॥ ౧౧॥

ఆ. ఈమరంత ఖేద-మేనుసహింపఁగాఁ।
జాలనయ్య ధరణి-పాలతిలక।
యేమి సేతునింక-నెచ్చటికేగుదు।
తెలిసి చూడ నాకు-దిక్కు లేదు॥ ౧౨॥

క. కావున దేహత్యాగముఁ
గావించెదనను మనఃప్ర-కారంబున నేం।
తేసగ చిప్పడమిఁబడియు।
ప్పావని గడురోషశోక-పరవశుఁడయ్యెన్॥ ౧౩॥

ఆ. అతనిఁ జూచిమంద-హాసంబు సేయుచు।
సుదతులను నులుఁగ పులుఁ-జూచుచుండ।
మధురభాషణముల-మారుతాత్మజుశోక।
మొల్లఁదొలఁగ రాముఁ-డిట్టులనియె॥ ౧౪॥

కం. మానవుఁడివ్విధమునన
జ్ఞానంబునవానఁ జెందు-సంతతమయ్యా
జ్ఞానముదొలఁగినునుత్తమ
మైనమహాసుఖముఁ జెందు-ననిలతనూజా ౨౪॥

కం. జ్ఞానమువలనం జెడును
జ్ఞానముకర్మమునఁ జెడదు జ్ఞానము నాబ్ర
జ్ఞానిలయపరబ్రహ్మ
జ్ఞానము వేదాంతవాక్యజనితంబును మీ॥ ౨౫॥

గీ. అట్టియొుకవిరక్తుఁడౌ-నట్టిమాన
వునకునుదయించుఁగాని యు-న్యునకుఁగాదు
జగతిముఖ్యాధికారికి-సంభవించు
జ్ఞానవిభవంబుగనుమనిబ్ర-సాదమహిమ॥ ౨౬॥

గీ. అంతరంగసితములుకా-మాదులెపుడు
విడుమమానవుఁడాత్మసం-వేదియగును
నపుడుబ్రహ్మస్వరూపుఁడై-యమయనతఁడు
శాంతమానసవినుముకే-సరికుమార॥ ౨౭॥

కం. మేలుకొనునతనినిద్రా
శీలునిభుజియించునతని-సితుఁడగువానిం
బాలిశునున్మత్తుంగల
కాలముఁ జేకొనుచునుండుఁ-గాలుఁడుజనులన్॥ ౨౮॥

గీ. నిశ్చయము సంక్షయాంతముల్-నిచయములును
ముచ్ఛ్రయంబులు పతనాంత-ములుదలంప
నరయసంయోగములువియో-గాంతములగు
జీవితముమరణాంతంబు-సిద్ధమనఘ॥ ౨౯॥

కం. పతనమునకంటెఫలసం
తతులకుఁబెరచోటభయము-దగలనికరణిన్

బొసఁగదానియందుఁ-బొసఁగెను శుభాశుభ।
భ్రాంతినిజము వోలెఁ-బవనతనయ॥ ౧౯॥

గీ. శుభముగానిపదార్థంబు-శుభము వోలెఁ।
గానఁబడు మోహవైభవ-కలనవలని।
భ్రాంతులకు రాగముదయించు-రాగవాంఛ।
బద్ధులై పుణ్యపాపైక-పరతఁజెంది॥ ౨౦॥

క. సురవిద్యాధరదానవుల।
నరదిగఁ బ్రబధ వింతురుగ్ర-యాతనలకు నా।
కరము నరకముఁ జెందుదు।
రరిసూదన మోహవశత-నఖిలప్రాణుల్॥ ౨౧॥

సీ. కర్పూరచంపకా-గరుసుగంధంబులై,
ఘ్రాణినంటినమలం-బైనశించు।
భక్ష్యభోజ్యాదిభ-క్షణపదార్థంబులై,
ఘ్రాణిసోకినవశు-దతవహించు।
ఘనపదుకూలన-స్త్రంబులై ఘ్రాణిసం,
గమునమాలిన్యంబు-గడుధరించుఁ।
గలితసుగంధశీ-తలజలపూరమై,
ఘ్రాణిసంగతినిమూ-త్రమనఁబరగు॥

గీ. నట్టిదేహంబుసుఖకరం-బగుట యెట్లు।
వినుము చెప్పెదనంజనా-తనయనీకుఁ।
బరమతత్త్వరహస్యంబు-భవమునందు।
జంతువులకును సౌఖ్యలే-శంబులేదు॥ ౨౨॥

ఆ. మొదటజన్మమొందుఁ-బదపడి బాల్యంబుఁ।
జెందుజవ్వనంబుఁ-జెందుముదియు।
నంతముదిమిఁ జెందు-నంతట మరణంబుఁ।
జెందుమరలజనన-మొందునరుఁడు॥ ౨౩॥

పగిదిభార్యాసుత-ప్రభృతులకూటమి,
నశ్వరంబగుఁగపి-నాథవినుము।
మేనిపుట్టువుతోడ-మృత్యువుజనియించు,
సందేహమింతయుఁ-జెందవలదు।

గీ. భావిమరణంబుఁదప్పింప-బ్రహ్మకైన।
నలవిగాదుశరీరిదేహాంతవేళఁ।
గర్మవశుఁడైస్వతంత్రుఁడు-గామినన్య।
తనువుఁగైకొనిమునుపంటి తనువువిడుచు॥ ౩౪॥

క. కేసరిసుతకలకాలము।
వాసంబొకచోటఁబ్రాణి-వర్గంబునకుం।
దాసమకూడదుకర్మము।
చేసన్యజనుల్వియుక్తిఁ-జెందుదురెందుఁ॥ ౩౫॥

క. ప్రాణంబులుదేహంబులు।
ప్రాణిమిచెడుమనుడఁబ్రభవ-ముంజెందుజగ।
త్ప్రాణాత్మజజన్మముని।
ర్వాణంబుంగలుగనేర-దాత్మకునెపుడున్॥ ౩౬॥

గీ. కానశోకహరంబువి-జ్ఞానమద్వ।
యంబుసద్రూపమనులంబు-నైనబ్రహ్మ।
మాత్మయోనభజింపుము-నారతంబు।
విగతశోకుఁడవగుదువి-వేకధుర్య॥

గీ. త్వత్కృతంబగుకార్యంబు-మత్కృతంబు।
మత్కృతంబగుకార్యంబు-త్వత్కృతంబు।
లీలనాయొనరించిన-లింగపూజ।
లీలనీయొనరించిన-లింగపూజ॥ ౩౭॥

వ. కావుననీనామంబున లింగప్రతిష్ఠఁగావించిన ముక్తుండ వగుదువు. హరదత్తంబగు హనుమన్నామక లింగంబు దర్శించి రామనాథేశ్వ

క్షితిఁబొడమినజంతువులకు
మృతికం బభయంబులేదు-మిథ్యావచనా॥ ౩౦॥

సీ. పటుతరస్తంభసం-భారమైనగృహంబు,
కాలంబుచనజీర్ణ-కలనఁజెందె
వశియింపకరణినా-నాప్రాణినికరంబు,
వాలాయముగమృత్యు-వశతనడఁగు
దినములు రాత్రులు-చనచనసర్వమా,
నవులకాయుష్యంబు-నాశమొందు
నాత్మసుశోకింప-నగునన్యమునకేల,
శోకంబెదవుతెల్వి-లేకనీవు

గీ. నెరయఁబుటెత్తుచున్నవా-నికినిలిచి
యున్నవానికైననా-యువునశించుఁ
దానిసమవర్తియునుజను-చాననిలచు
దూరమరిగియుమృత్యువు-తోనమరలు॥ ౩౧॥

క. వళులుద్భవించుమేనం
దలవెంట్రుకలెల్లనెరియు-దంతములూడున్
బలముడుగుశ్వాసకాసము
లలముకొనుస్మృతిని దేహ-మలజడినొందున్॥ ౩౨॥

గీ. వరదకట్టెయుయొకచోట-వనధియందుఁ
గలసియంతటవిడిపోవు-కరణిదార
పుత్రబాంధవధనపశు-క్షేత్రవర్గ
మొకప్డుచోఁగూడునెడఁబాయు-నొకప్డువేళ॥ ౩౩॥

సీ. చనుచున్నతెరువరిఁ-గనితోవనొకతెరు,
వరినేనునీతోడ-వత్తుదనని
యంతవారిద్దఱుఁ-గొంతకాలముగూడి,
చనివెండియునుభిన్న-సరణిజనిన

ఉ. నేమముతోడ నేనిచట-నిల్పినయాశివలింగమూర్తిని।
సామినివీకతోఁడివియఁ-జాలెడులావరియున్న వాఁడెసఁ।
గ్రామజయాఖ్యలింగమిటఁ-గైకొని పెల్లగిలంగఁజేయుము।
ప్రేమతనీదులింగముము-దంబుననిల్పుము మానుశోకమున్॥ ౪౬॥

చ. అనవుఁడుసంతసంబునప-శాసనవైరికిమ్రొక్కియాంజనా।
తనయుఁడుగ్రక్కునం బెటికె-దన్ సిరిలామయలింగ సెసస్తా।
స్థానకమునుండి తెచ్చినస-మంచితలింగమునిందునిల్పదన్।
వినకరిలింగసైకతవి-ఘేదనమాంబలిలేమెతలంపఁగన్॥ ౪౭

సీ. అనివిచారముచేసి-హనుమంతుఁడంతటఁ,
దమకంబుమటనిసం-దడిగొనంగ।
సురలునుమానులు వా-నరులు దైత్యులు రఘు,
స్వామి సౌమిత్రియు-జానకియును।
గనుఁగొనుచుండసై-కతలింగమూర్తినిఁ,
గరమునఁగొనియత్న-గౌరవమున।
లావుననటునిటు-లాదిచలింపంగఁ,
జేయుచుఁగదలంగఁ-జేయలేక।

గీ. కిలకిలధ్వనిసేయుచుఁ-గేశవుఁడు।
తోకనిగుడించిరెండుచే-తులనుబాదివి।
యూచిబెరికియుఁబెకలింప-నోపఁడయ్యె।
నవనిఫలయుక్తమగుసెదు-రాగ్రహంబు॥ ౪౮॥

వ. అంత. ౪౯॥

మ. అమితోద్దారబలుండువాయుతనయుం-డాలింగము న్వాలపా
శమునంజుట్టిబిగించితీవ్రముగహ-స్తంబుల్ భువిన్మోపిపే।
గమునిండారఁగనభ్రవీధికెగసెన్-గాఢోద్ధతిన్ భూమిచ।
క్రముశైలంబులతోనరణ్యములతోఁ-గంపంబునొందెంపుచున్॥

ఆ. ఇట్లుగగనవీధి-కెగసిరాఘవలింగ।
మునకుఁగ్రోశమాత్ర-మునన రుండు।

రుం జూచిన నరుండు కృతకృత్యుండగు యోజనసహస్రదూరంబు
నన్నైన హనుమల్లింగంబు సంస్మరించి రామేశ్వరునిం దలంచి సా
యుజ్యంబు వడయుచుండని రాఘవుండు మఱియు నిట్లనియె.

ఆ. ఆతఁడుచేసినాఁడు-యజ్ఞంబులన్నియు।
సకలతపములతఁడు-సలిపినాఁడు।
హర్షముప్పతిల్ల-హనుమదీశ్వరరాఘ।
వేశ్వరులనుజూచు-నెవ్వఁడైన॥ ౮౦॥

వ. హనుమత్ప్రతిష్ఠితలింగంబును, రామేశ్వరలింగంబును, జానకీ
లింగంబును, లక్ష్మణేశ్వరలింగంబును, సుగ్రీవకృతలింగంబును,
సేతుకర్తయగు నలుండునిలిపిన లింగంబును, అంగదేశ్వరలింగం
బును, నీలస్థాపితలింగంబును, జాంబవదీశ్వరలింగంబును, విభీ
షణుండు గావించిన రత్నలింగంబును, ఇంద్రాది దేవతా
ప్రతిష్ఠిత లింగంబును, శేషాది నాగరాజపూజిత లింగంబును,
నన ద్వాదశరూపంబుల శివుండు సాక్షాత్కరించి రాజిల్లు సా
ర్వకాలంబు నీలింగంబులందు మహేశ్వరుండు సన్నిహితుఁడై
యుండుఁ గావున పాపక్షయార్థంబు శివలింగస్థాపనంబుఁ గా
వింపుము. ౮౧॥

క. కావున్నమత్ప్రతిష్ఠిత।
సైకతలింగంబుకడువె-సందివియుమధై।
ర్యాకరయంతటనిలిపెనఁ।
జేకొనినీతెచ్చినట్టి-శివలింగంబున్॥ ౮౨॥

క. లలిఁబాతాళంబురసా।
తలమతలముసుతలమునువి-తలలోకతలా।
తలములుభేదించిసను।
జ్జ్వలమైయాలింగమునుదె వారసముఖ్యా॥ ౮౩॥

సురగణంబులు మెచ్చ-సురసనుసాగమా,
త్వకనునాపైగల్చి-తివిగుణాఢ్య।
ఛాయాభిధానరా-క్షసినిశిక్షించితి,
వధికదోఃప్రశక్తినా-కైహరీశ।

ఆ. దినసమాప్తిసమయ-మునను వేలముఁ జేరి।
లంకపొంక మడఁచి-శంక లేక।
పశ్చి-ముఖుని కేళి-భవనంబులోనికి।
నరిగితివి మదర-మనిలతనయ॥ ౫౪॥

క. వెరవెఱిఁగి రేయి లంకా।
పురిలోపల సీత వెదకి-పొడగానక మే।
దురమగు నశోకవనమున।
కరిగి కనుంగొంటివచట-నవనీపుత్త్రిన్॥ ౫౫॥

చ. కనుఁగొని సాగిమ్రొక్కి మణి-కల్పితముద్రిక యానవాలుగా।
విలయమెలర్ప నిచ్చి ఘన-వేణియొసంగిన మానికంబుఁ జే।
కొని సుకుమారచారుసుమ-గుచ్ఛవిరాజదశోకకాననా।
వనిరుహభంజనంబు బుధ-వత్సల సేయవె నాకు మేలుగాన్॥ ౫౬॥

వ. అంత. ౫౭॥

ఉ. శంకయొకింత లేక బహు-సైన్యులరావణతుల్యులన్నిరా।
తంకబలాఢ్యులన్విజయ-ధాటికశీతిసహస్రవీరులం।
గింకరనామదైత్యులని-కృత్రిమదైత్యులసంగరక్షితిం।
బొంకమడంచియంతకుని-ప్రోలికిబంపవె వానరోత్తమా॥ ౫౮॥

చ. అనిమొనజంబుమాలినిఁ-బహస్తకుమారుని సప్తమంత్రినం।
దనులవధించి పంచపృత-నాపతులంబొలియించి దక్షున।
క్షునిఁ బెగటార్చి యంతటన-కుంతితశక్తినిఁ దార్చిళ్ళఁ గట్టిగ్ర।
కన్గొనఁగొని పోవ రావణుని-కొల్వునకుం జనితీవు పావనీ॥ ౫౯॥

ఉ. ఆసభలోన నిల్చి దను-జాధిపువాక్కులధిక్కరించి దు।
ష్టాసురులెల్లఁ దల్లడిల-నాదట రావణు విడుతంద్రికెం।

పుడమిఁ ద్రెళ్ళి మూర్ఛఁ-బొంది వడంకుచు।
శివవిరోధి కేలుఁ-జెందువాఁడె॥ ౪౯॥

ఆ. పుడమిఁ బడియె గాఢ-కొడుకుముక్కున నోటఁ।
గన్నుదోయివలనఁ-గర్ణరంధ్ర।
ములన పాపమార్గ-మునఁ జాల నెత్తురు।
గురిసి నిండె రక్త-కుండమయ్యె॥ ౫౦॥

వ. అంత దేవదానవ తపోధన నరవానరులు హాహాకారంబుఁ జేసిరి. రామలక్ష్మణులు సీతాదేవియు నంతరంగంబుల నెంతయుఁ జింతింపుచు శోకవ్యాకులత్వంబు నొందిరంత నంపఱుంజరి ఘూర్ణితగాత్రుండై ధాత్రింబడి రక్తంబుఁ గ్రక్కుచు మూర్ఛిల్లియున్న వానిన్నందనుం జూచి కపులు పుహమింపఁబడిరి. జానకీదేవియు వాత్సల్యంబునం గరపల్లవంబులం దదీయ దేహస్పర్శనంబు సేసి తంత్రీ సీకిట్టి దుర్దశ వాటిల్లె నేయని వగచె. రాఘవుండు బాష్పధారాకులలోచనుండై తనతొడమీఁద నతని నిడుకొని కరకమలంబుల నెమ్మేను నిముడుచు నిల్చినిరొ.

క. పేనుఁగుమనుము ముబంపా।
కాననమునఁ జూచి మేలుఁ-గావింపుమటకై।
ఘనుజు నతోడ సఖ్యము।
మానుగఁ జేయించి తివిస-మంచితవృత్తిన్॥ ౫౨॥

క. అఘారినన్నుఁ గనుంగొని।
జననీజనకుల నుబంధు-జాలములను బే।
రొక్క-నితలఁచ మునియుఖకృతి।
గొనకొని యుంతిని వచింపు-సుగుణరత్ననిధీ॥ ౫౩॥

సీ. బహుయోజనంబైన-పాథోనిధానంబు।
తివిరి నాకై దాటి-తివిరి మహాత్మ।
తలప్రాతమును ద్రొక్కి-దట్టించి తివిరిసీక,
నాకై నగేంద్రుమై-నాకు నఘ'

గీ. జగములభినుతి సేయశో-పఘ్నులు తెచ్చి।
యన్నపద్మములమ్ము బ్ర-హ్మాస్త్రబంధ।
ముక్తులను జేసినాఁడవు శక్తి మెఱయ।
దాతపునులక్ష్మణప్రాణ-దాత వీవ॥ ౬౫॥

క. కేసరిసుతయని మొనసీ।
బాంటచేరావణాది-బలములదైత్యా।
గ్రేసులగెల్చిలీలన్।
భూసుతనతిసాధ్వియుతలఁ-బొందితిసుఖినై॥ ౬౬॥

ఆ. అంజనాకుమార-హనుమంత జానకీ।
శోకమునను సకల-లోక విరుతా।
యుచితవృత్తిమమున-యోధ్యనుందోడ్రాని।
చనక విడిచినీవు-చనుటదగునె॥ ౬౭॥

క. ఓపాపిష్ఠమదాంతక।
యోపవనకుమార యోమహో-న్నతబాహా।
టోపవిరాజిత యోకరు।
ణాకర యోవత్సలేటి-నన్నుఁ గోనుమీ॥ ౬౮॥

క. అని బహుభంగులను పలా।
లనవచనము లాడిరఘుకు-లప్రవరుండా।
తనినోటిమాట లేమికి।
వనరుచుఁగన్నీటఁదడిపె-వాయుతనూజున్॥ ౬౯॥

వ. అంతఁ గొంసేపునకు మూర-విసనాడి ప్రబోధంబునొంది. ౭౦.

మ. కనియెన్మారుతి సర్వలోకపరిర-క్షాదక్షునంభోజలో।
చను లీలాధృతమానవాకృతిని వి-శ్వధ్యేయు నారాయణున్।
మునివంద్యున్ రణఘూళిధూసరునతాం-భోవాహసంకాశు భూ।
తనయాలక్ష్మణవానరాన్వితు మహో-దారున్ హరిన్ రాఘవున్॥

క. కనిరఘువరకరసంస్ప।
ర్శనపరిపూర్ణాంగుఁడగుట-జగతీస్థలినో।

తేపఁ బైఁడైనవహ్నికిన-తిప్రముదంబుగఁ గాల్చిక్రమ్మరఁగ।
ధ్వనిసంకటమ్ము జాటితివి-తాపసనీవు మహాపయోనిధిఁగ॥ ౬౦॥

గీ. అంతవచ్చితె బుద్ధిమా-కాద్రికడను।
నిష్ప్రపంచమనాకైయ-నేకగతుల।
ననుశమించితివేపమో-యాంజనేయ।
నాకునీవంటిచుట్టము-న్నాఁడెయొండు॥ ౬౧॥

నీవునిదురింపుచున్నావు-నేలమీఁద।
నాకునపరిమితంబగు-శోకమొదవఁ।
బ్రాణములయ్యండనను నీవు-బ్రదుకవేనిఁ।
బ్రాణములునిల్చునే నాకుఁ-బవనతనయ॥ ౬౨॥

క. ఏమిపనినాకుసీతా।
సౌమిత్రులచేతభరత-శత్రుఘ్నులచే।
నేమిమహీరాజ్యముచే।
నేమిభవద్రహితసుఖము-లేటికివత్సా॥ ౬౩॥

క. లెమ్ముహనుమంతభూమిత।
లమ్ముననిదురింపనేల-లలిఁబల్లవపుం।
జిమ్మునఁజేయుమునిద్రా।
రమ్మిప్పుడునాకునొకఁ-తల్పమువత్సా॥ ౬౪॥

సీ. స్నానంబుసేయంగఁ-జనిమొదనిప్పుడు,
కౌనితెమ్ము-చీరయుఁ-గుండికయును।
సురపూజనమునకు-సురభిపుష్పముతెర్చి,
పొసఁగఁగోయుముపత్ర-పుటమునందుఁ।
గానలోకేనేగి-కందమూలంబులా,
హారముసకునుదె-మ్మాదరమున।
వజినదర్భాంశుక-వ్రజసమాహరణంబుఁ,
గావింపుమాచార-మావహిల్ల।

గరాగాధిపుత్రా ధ్వరత్రాణదక్షా శరత్కాలచంద్ర ప్రసన్నాననా నీలజీమూతసంకాశపుణ్యాకృతీ, పద్మగర్భాదిబృందారకానంద సంధాయిలీలావతారాహతారాతి బాహాబలోత్సేక కాకాసురైకాంబకాదానత్ప్రాప్తాంబకా శారదారంభరాకా నిశాకాంత సాహస్రశోభాతిరస్ఫార కారిస్ఫురత్కీర్తి సందోహసంఛన్న దిఙ్మండలామండలాగ్ర ప్రచండాహి రాజోపరిక్లృప్తశేషస్వాప చరవార్ధివాతామహా తాపసస్వాంత హృద్దివ్యసౌందర్య లీలారసాసార సాప్తాత్రజాశేష కీశాధిరాజ్యప్రదా వేదవేదాంత సంవేద్యనిర్మాయరూపా, సుహృత్తోయజుష్టానిలాకాశపాత్రోర్వరా నిర్జరారాధ్యయోగీశ్వరోపాస్య ఓంకారమంత్రార్థ విజ్ఞేయభక్తప్రియానంత కల్యాణచారిత్ర పద్మావదూరాకృపాధార నేత్రాంబుజా చండరుఙ్మండలీమధ్యవర్తీ సుధాభానుమూర్తీ భుజంగేశశాయీ చతుర్వ్యూహదేహా అనంతావతారా శతానందముఖ్యామర ప్రార్థితా విశ్వవిశ్వంభరా భారకృద్దైత్యసంహారకామాది కాంతర్గతారాతిజైత్రా సమస్తాశ్రితా రామచైత్రా సితాంభోజనేత్రా ధరిత్రీకుమారీకళత్రా మనోజ్ఞాతసీపుష్ప సంకాశగాత్రా పవిత్రా గణానామృత కాకుత్స్థవంశాగ్రణీభక్త చింతామణీ నీకు దండంబు నీకుం బ్రణామంబు నీకున్నమస్కారముల్ నీకు జేజే నమోవాకముల్ నీకు కారుణ్యదృష్టిం బ్రసన్నుండవై నన్ను రక్షింపవే నిన్ను సేవించెదన్ నిన్ను భావించెద న్నీపదాంభోజ దాస్యంబు గావించెదన్ మ్రొక్కెదన్ రామచంద్రా మదీయాపరాధంబు క్షమింతవ్యమో స్వామి నామీఁద నీ మేదురాంచత్కృపాపూర్ణప్రసాదంబుతో రంబుగాఁజేసి చేపట్టవే రాఘవా సజ్జనార్చిత భక్తప్రియా జాగరూకత్వ నిద్రాసుషుప్త్యాద్యవస్థావిశేషంబులన్నన్ను రక్షించుమీ జానకీకాంత వేదాంతవాక్యంబులన్నిన్ను వాక్రుచ్చఁగాలేవు లోకత్రయిన్నెన్ను వర్ణింపనెవ్వాఁడు శక్తుండు నిత్యోత్సవా నీమహత్త్వం బచింత్యంబనంతంబు సర్వత్రకా నీకచంబుల్ మహామేఘముల్ లోక

య్యనఁ జాఁగి మ్రొక్కి-మారుతి।
ఘనభక్తిఁ బలికెఁ బ్రకటల-ఘటితాంజలియై॥ ౭౨॥

గీ. పారివలతా మూలాంక-బ్రహ్మనాము।
జానకీరాము జలధర-శ్యామునతఁడు।
శ్రుతిమనోహరగంభీర-సూక్తిగుంఫ।
దోహలంబుగ నుతి సేయ-దొడఁగె నిట్లు॥ ౭౩॥

దండకము.

శ్రీరామ విశ్వస్వరూపా హరీయాదిదేవా పురాణాగదాహస్తదేవా
మహాపుష్పకాశ్రీంహాద్రోల్ల సద్యానరానీక సంజుష్టపాదాబ్జ నిష్పిష్ట
దుష్టాసురేంద్రా జగద్వాంఛితార్థప్రదానిర్మలాత్మా సహస్రోత్తమాం
గా సహస్రాంఘ్రిపద్మా సహస్రాక్షనారాయణా! రాఘవా భక్త
లోకార్తిహారీ మహీనందనావల్లభా నారసింహా సురారాతిరాష్ట్రం
జనాపోత్రిమూర్తీ, నిశాతాగ్రదంష్ట్రోద్ధృత క్షోణిచక్రా అవక్రో
జ్జ్వలద్విక్రమాకాంబరీ వామనాసిద్ధవంద్యా బలింద్రారియాగాంతకా
మందరగ్రావధారీ మహాకచ్ఛపా వేదసంరక్షకా మత్స్యరూపా జిత
క్షత్రియా భార్గవశ్రేష్ఠ రాత్రించరధ్వాంత సంతానపంకేజినీబాంధవా
రాఘవా చండఘోరాక్ష కోదండనిర్భిన్న నానారివధ్వంసకృద్భార్గవ
త్రాసకారీ,అహల్యాసతీశాపసంతాపహృత్పాదపంకేజనాగాయుతో
దారసత్త్వోజ్జ్వలత్తాటకాప్రాణహృత్సాయకా వాలివక్షశ్శిలాఖండలా
ప్రోద్ధనుర్దండ మాయాసువర్ణాంగ సారంగసద్దర్పహారీ దురంతాఘ
సంతాపహారీ, దశస్యందనోర్వీశ దుఃఖాబ్ధిసంశోషణాగస్త్యరూపా,
అనేకోర్మిమాలావలీఢాఖిలాశాంత దుర్దాంతవారాశిగర్వాపహా మై
థిలీమానసాంభోజ మార్తాండవిశ్వైకసాక్షీ సరాజేక్షణాభక్త సంర
క్షణాసక్త రాజేంద్రసీతాపతీ తారకబ్రహ్మరూపా వరేణ్యాచిదానం
దమూర్తీ ప్రసన్నార్తిహారీ జగన్నాయకా రామచంద్రా కృపాసా

స్త్రావిద్యాం ద్రయీరూపిణిం బార్వతీరూప నాత్మం దలంతు బ్రస
న్నాననాంభోరుహన్ లక్ష్మి దుర్గాధిపుత్రిన్ బవిత్ర న్భజింతు
న్మృగాంకస్వన న్మూజగావింతు సర్వాంగసౌందర్య సంశోభిని
న్నిన్నువర్ణింతు ధర్మస్వరూపన్ దయామూర్తి సావిత్రి గాయత్రి
బద్మాలయన్బద్మపాణి న్సరోజాక్షవక్షస్స్థలీమందిరం జంద్రబింబా
నన న్జంద్రబింబాసనాసీన నాహ్లాదరూప న్మహాసిద్ధసాధ్వి న్సుభ
ద్రప్రదాత్రిన్ ద్రిలోకైకధాత్రిన్ ధరిత్రీకుమారి న్జగత్పావని
న్సీత సర్వానవద్యాంగినంభోజగంధి న్మహాదేవి వాక్పుష్ప పూజా
విధానంబున న్సేవగావింతుమాతల్లికి న్రాఘవస్వామిదేవేరికి న్సీత
కు న్భక్తజాతంబు మీఁదం గృపాశీతలాపాంగవీక్షాసుధాసార
ముం జిల్కువిన్నాణికి న్నిత్యకల్యాణికి న్నీలజీమూతశేఖాతిర
స్కారకృద్వేణికి న్పారిజాతప్రవాళోల్లసత్పాణికిం దమ్మిపూమే
డలం గ్రీడ గావించు వాల్గంటికి న్వేల్పుప్రోయాళ్ళచే మ్రొ
క్కుగొన్నట్టి రాకన్నెకుం జాలువాప్రోగుజొంపంబుగా ల్త్రుక్కు
లం జులుక్కగాఁ జూడు నెమ్మేనిచాయం జగంబెల్ల నిండించుసీతా
మహాదేవికి న్నీకుఁ బల్మాఱు నే మ్రొక్కెదన్. ౭౪॥

గీ. ఇవ్విధంబునహనుమంతుఁ-డింపు వెలయ।
రామచంద్రునిసీతను-బ్రస్తుతించి।
సమధికానందసందోహ-జనితబాష్ప।
వారిపూరితహృదయుఁ డై-యూరకుండె॥ ౭౫॥

క. మునులారపవనసుతకృత।
జనకసుతారామచంద్ర-సంస్తవపఠనం।
బొనరించునరుఁడు గాంచును।
ధనధాన్యగజాశ్వసంప-దలు మోక్షంబున్॥ ౭౬॥

వ ఈసీతారామస్తోత్రంబు భక్తిపూర్వకంబుగా నేకవారంబు విను
వారికిం బఠించువారికి నాయుర్విద్యాపుత్త్రవనితాసౌఖ్యంబులు

నాథా సుధాభానుభానుల్ భవన్నేత్రముల్ శేషతల్పకర్ణాశాయీ దిశల్ నీకుఁ గర్ణంబు లానందకందా కృశానుండు నీమోము దేవేశ్వరా శారదాదేవి నీజిహ్వ శాశాసనామ్నాయ పారీణ నీప్రాణముల్ వాయువుల్ జ్ఞానవిద్యానిధీ వారిధుల్ నీకుఁ గుక్షిప్రదేశంబు రాజీవపత్రేక్షణా యంతరిక్షంబు నీనాభి యోగీశ్వరధ్యేయపాదా భవత్పాదముల్ భూమి శ్రీకేశవా నీశరీరంబు విశ్వంబు శ్రీరామచంద్రా సముద్రంబునన్ ఫేనపుంజోర్మికా బుద్బుదశ్రేణిచందంబునన్ దేవతిర్యఙ్నరాదిప్రపంచంబు నీయందు జన్మించి నీయంద యేకీభవించున్ జగజ్జీవ నారత్నబృందంబు సూత్రంబునం బోలె సర్వంబు నీయందగున్ సూత్రమై పొల్చుధర్మాకృతీ నిన్ను నిర్మానమోహుల్ విరక్తాత్ములధ్యాత్మనిత్యుల్ మునీంద్రుల్ నివృత్తాభిలాషుల్ జితస్వాంతులత్యంత నిష్ఠాసఘుల్ భక్తియుక్తుల్ వివిక్తప్రవాసీనులాచారవంతుల్ బుధుల్గాంతు రాదిత్యకోటిప్రభా తారకాదిత్యచంద్రాగ్ని విద్యుత్సమూహంబు లెచ్చోటఁ దేజంబు వాటింపఁగాఁజాల వెద్దానఁ ధీరుల్ ప్రవేశించి శోకించ రచ్చోట నీదివ్యధామంబు శ్రీరామచంద్రా కృపాసాంద్ర నీతత్త్వ మెవ్వారికిన్ నిర్ణయించగ శక్యంబుగాకుండు నేనేమి వర్ణింపఁగా నేర్తు లోలాత్ముడన్ బాలుఁడ న్గర్వశీలుండ నానేరముల్ పైకొతెంచన్ సహించందగున్ మ్రొక్కెద న్నిన్ను బ్రార్థించెద వేఁడెదన్ దివ్యపాదారవిందద్వయీ దాస్యయోగ్యత్వుఁగాఁ జూచి నన్నుం గటాక్షించి రక్షించవే యంచు మదారుమందారభూమీరుహా రామరాముం బ్రశంసించి నిర్వంచనప్రౌఢభక్తిన్ జగత్ప్రాణసూనుండు శ్రీజానకీదేవి నీతెఱంగైవారముల్ సేసె శ్రీమైథిలీ నీకు దండప్రణామంబు సర్వాఘసంహారిణీ నీకుఁ జేమోడ్పు దారిద్ర్యవిచ్ఛేదనీ నీకు జేజే ఋణధ్వంసినీ నిన్ను సేవింతు భక్తప్రజాభీష్టసంధాయినీ నిన్ను భావింతు ధన్యా స్వదేహక్ష్మాధీశకన్యా ప్రశంసించెద న్రాఘవానందదాత్రీ మహీపుత్రిక న్విద్యనాద్య న్ప్రధానస్వరూప న్నవ న్ప్రాజ్ఞైశ్వర్యసంపత్తిభూతి న్నతి న్భారతిన్ జానకిం గొల్చె నన్నత్తఱిం బాదివ్యమూర్తిన్ హరిప్రేయసిం బ్ర

క. ఇష్టుఁడునదులనవగా।
హమ్మునఫలమెద్దిగలుగు-ననఘాజనబృం।
దమ్ముఁ కీహనుమత్కుం।
డమ్మునఁదత్ఫలముమజ్జ-నంబునదొరకున్॥ ౧౪॥

మ. మనుజాండైవసుధన్ జనించియుహనూ-మత్కుండతీరంబునన్।
ఘనభక్తింబిత్రుకార్యమరిసలుపం-గానొల్లఁడెవ్వాఁడుకో।
పనుపైపోదురువానిఁజూచిపితరుల్-పాకారిముఖ్యామరుల్।
మునులున్సిద్ధులుకోపమూనుదురుద-న్మూర్ఖాత్ముపైనెంతయున్॥ ౧౫

గీ. హనుమతకుండసన్నిధి-ననఘులార।
జపముహోమముదానంబు-సలుఁపడేని।
జనునిజీవితమప్రయో-జకముదుఃఖ।
భాజనంబగుగడువిష్ట-పద్వయమున॥ ౧౬॥

క. హనుమతకుండసన్నిధి।
సేనరుఁడుతిలోదకంబు-నీడునియతుండై।
వానిపితరులాజ్యనదీ।
పానముసేయుదురునిజము-పలికితివత్సా॥ ౧౭॥

వ. ఇట్లు శ్రీరామచంద్రుండు పలికిన పలుకులు విని సంతుష్టస్వాంతుండై హనూమంతుండు వెండికొండనుండి తనతెచ్చినలింగంబు రఘుపుంగవు నాజ్ఞాక్రమంబున రామనాథేశ్వరు నుత్తరంబునం బ్రతిష్ఠించి కృతార్థుండయ్యెహనుమద్వాలవేష్టితసంజాతంబగు వళిత్రయంబు రామనాథేశ్వరుండు ధరించు నిట్లు సేతుమధ్యంబున గంధమాదనగిరి శృంగంబున శ్రీరాఘవుండు శివలింగప్రతిష్ఠాపనంబు చేసినతెరంగు మీకెఱింగించితి నదిపఠించువారును, విన్నవారును, దురితంబులం బాఱదోలి శివలోకంబునం బూజవడయుదురని సూతుండు వివరించిన శౌనకాదిమహర్షుల మ్మహాత్మునకిట్లనిరి. ౧౮॥

సిద్ధించు బ్రహ్మవధాది ఘోరపాతకంబులు నశించు. నరకదర్శనం
బు లేదు. సకలమనోరథంబులు ఫలించు. సమస్తక్రతుఫలంబు దొ
రకు నిట్లు వాయుఁడు చెప్పిన పార్థివుండై కౌసల్యానందనుం డతని
కిట్లనియె ౨౭॥

క. ఎఱుఁగక కావించితివి
త్తఱి సాహసమీవు హరివి-ధాత్రాదిసుర
ల్వెఱువరె మత్కృతలింగముఁ
దెఱుకఁగ నోపుదురె యసుర-భీకరమూర్తీ॥ ౨౮॥

గీ. హరునికపరాధ మొనరించి-యువనిమీఁదఁ
బ్రదెళ్ళిమూర్ఛిల్లితివి గదా-ధీరవర్య।
యింకనెన్నటికిని చార్వ-తీశునెడల।
ద్రోహ మొనరింపకుము గంధ-వాహతనయ॥ ౨౯॥

వ. భవత్ప్రతిష్ఠాపనం బగు నేతత్కుండంబు నీనామంబున నిది మొదలు
గ ముజ్జగంబుల నతివిఖ్యాతం బై వర్తిల్లు దీనియందు మజ్జనమాత్రం
బున మహాపాతకసంఘాతంబు నశించు నని మఱియు నిట్లనియె॥

గీ. శివజటాఘాతసంజాత-శీతలార్తి।
గౌతమీనదిసురనద్రి-కన్యకీర్తి।
యశ్వమేధాఖ్యయజ్ఞస-హస్రఫలము।
సంగుఁదనినీట మునిఁగిన-జనులకెల్ల॥ ౩౧॥

గీ. దానికంటెను శతగుణం-బైనఫలము।
మనుజవరులకొసంగుని-ర్మలతరంగ।
యమునయు సరస్వతియు రెండు-నమరతటిని।
కరణిఫలమీయఁగా నేర్చు-నరులకెందు॥ ౩౨॥

గీ. భువనపావనులీమూఁడు-పుణ్యనదులఁ।
గలసి ప్రవహించునిచ్చోటఁ-గపివరేణ్య।
యచటనవగాహనమునసహస్రగుణిత।
ఫలము సిద్ధించుజనులకు-నలఘుమహిమ॥ ౩౩॥

గీ. తరుణి నెమ్మోముతోఁ డసు-ధాకరుండు।
సాటిగాలేక జనితల-జ్జాభరమునఁ।
శివజటాజూట వనదుర్గ-సీమఁ జేరె।
నజ్జమునమఃకుళీభావ-మాశ్రయించె॥ ౯౬॥

క. ముక్కుతిలకుసుమము పురా।
చక్కెర కెమ్మోవి భళిరె-జక్కవ లేపో।
చిక్కనిచనుగవ చొక్కపు।
చెక్కులజిగి లెక్కసేయ-శేషునితరమే॥ ౯౭॥

క. కుందంబులుగదనములర।
విందంబులుకెరములలరు-వెంద్రుకలళినీ।
బృందంబులు నడకలుకడు।
మందంబులు మాటలెన్న-మకరందంబుల్॥ ౯౮॥

క. తమ్ములు నయనములళిపో।
తమ్ములు చికురములు పర్వ-తమ్ములకనుఁగుం।
దమ్ములు గుబ్బలు మరుకుం।
తమ్ములపాల్గారెబుధులు-దానింగన్నన్॥ ౯౯॥

క. మంజులతనమరి కెంపుల।
కెంజాయకుజుట్టమైయ కృత్రిమరుచులన్।
రంజిల్లితొగరువాతెర।
క్రౌంజిగురున మేలుగూర్చెఁ-గొమ్మకు భళిరే॥ ౧౦౦॥

గీ మేలుగలవాలుగలగెల్వఁ-జాలువాలు।
వాలుగన్నులు నిజరుచి-జాలకలనఁ।
దరుణహిమకరరేఖను-దతినిగ్రమ్ము।
తరుణిఫాలంబు నవఘున-స్ఫురణమహిమ॥ ౧౦౧॥

సీ. మాలూరఫలముల-మేలు చూరలుపట్టి,
కందుకంబులతీరుఁ-గ్రిందుపరచి।

గీ. జలజహిత తేజ రోమహ-ర్షణ తనూజ!
రావణుఁడు బ్రాహ్మణుఁడు గాడు-రక్కసుండు!
వానిదునిమిన నెటువలె-వచ్చెభువవ!
భర్తయగు రఘువరునకు-బ్రహ్మహత్య!! ౮౯

క. ఇది తెల్పఁగ వచియింపుము!
మదిసంశయ మెల్లఁదీర-మాకిపుడు దయా!
హృదయ సమస్తార్థవిశా!
రదుఁడవు నీవనఘ బాద-రాయణు కరుణన్!! ౯౦

వ. అనియడిగిన సూతుం డిట్లని చెప్పందొడంగె. ౯౧

క. వనరుహభవునకు సుతుఁడై!
జనియించెఁ బులస్త్యుఁ డధిక-శాంతాత్ముండై!
తనికుద్భవించె విశ్రవుఁ!
డనవిశ్రుతుఁడైన పుత్త్రుఁ-డసమానుండై!! ౯౨

క. మునిపుంగవుఁడు పులస్త్యుని!
తనయుండగు విశ్రవుండు-ధర్మాత్ముండై!
యనిమిషులకు దుష్కరమగు!
ఘనతప మొనరించె నజుఁడు-కౌతుక మొందన్!! ౯౩

వ. ఆతండు తపంబు సేయుచున్న కాలంబునం గాలాంబుద సంకాశదేహుండును, హేమనిష్కాంగద ధరుండునగు సుమాలియను రాక్షసుండు పాతాళస్థానంబువలన నిర్గమించి నెత్తమ్మికేలంబూనని పాలమున్నీటికన్నియం బోనితనచిన్నిముద్దు కన్నియందోడ్కొని భూలోకంబున నన్నియెడలం గ్రుమ్మరుచుండె నయ్యిందుముఖి సౌందర్యంబు వర్ణింప నరవిందసంభవునకైన నలవిగాదు.

చ. మినుకుగడాని పైఁడిజిగి-మించులచాయయు సంగ్రహించి కొ!
న్నఁగల సౌకుమార్యము ఘ-నంబగు పద్మసుగంధసారముం!
గొని వనజాతసంభవుఁడు-కోమలిమేను రచించె వీనికిం!
గనుఁగొనఁగా నిదర్శనము-కాంతిమృదుత్వసుగంధసంపదల్!! ౯౪

ఆ. కనికు జేరసముఁడు-తనయుండు మనలకు।
దారికె నేని వెరపు-దొరఁగి వృద్ధిఁ।
జెందఁగలమటంచుఁ-జింతించితనమూఁటుఁ।
పిలిచియిట్టులనియెఁ-బ్రేమగులుక॥ ౧౦౭॥
గీ. అమ్మకైకసిసంప్రాప్త-మయ్యెనీకు।
నిండుజవ్వనమటు గాన-నిన్ను పరున।
కివ్వనికి నైనఁదగు వాని-కీయవలయు।
నెవ్వఁడువరించునో కాని-యెఱుఁగరాదు॥ ౧౦౮॥
క. తగుమగనికిఁబడుచునిడం।
దగునిట్లిడకున్నఁగన్న-తండ్రికిదుఃఖం।
బగుఁగాన నాడుబడుచుల।
జగతింగనువారికెల్ల-సౌఖ్యముగలదే॥ ౧౦౯॥
ఆ. అఖిలక్ష్మీకరణి-నన్ని తెరంగుల।
దొడ్డదానవమ్మ-బిడ్డనీవు।
తగరువారలను మఁ-డెగడుముఁనియెట్టి।
వారు వెరచియడుగ-రారునిన్ను॥ ౧౧౦॥
ఉ. కావునసన్మునింగనక-గర్భ్యనిపాత్రుఁబులస్త్యపుత్త్రిభూ।
దేవునివిశ్రవుంబరమ-ధీరుగుణాకరునీశయోగిస।
ద్భావమునన్వరింపుముశు-భంబుగనీకుఁనుబేరసన్నిభుల్।
శ్రీవెలయంగుమారులుప్ర-సిద్ధులుగల్గెదరబ్జలోచనా॥ ౧౧౧॥
క. అనిపలికిననవ్వాక్యము।
వినికైకసిమందహాస-విలసితముఖియై।
వినయముననట్లయగుఁగా।
కనిమనమునసమ్మతించి-యంచితబుద్ధిన్॥ ౧౧౨॥
వ. అంత
క. బాలారత్నముసాయం।
కాలంబునజనకునాజ్ఞఁ గైకొనితగన।

నెత్తమ్మిమొగ్గల-బిత్తరంబుభ్రమించి,
చక్రవాకస్ఫూర్తి-సాక్రమించి।
కుసుమగుచ్ఛంబుల-పసహసింపఁగఁజాలి,
భర్మకుంభములఁజే-పట్టనేర్చి।
మత్తవారణకుంభ-మహిమంబుభేదించి,
యాలఘుపర్వతలీలఁ-జాలకఁజూచి॥

గీ. బాహుమూలంబులోరయము-బలసిపొగడు।
కొనివిజృంభించియొప్పుల-కుప్పలగుచు।
మేలువట్టువసిబ్బెంపు-మెఱుఁగుగుబ్బ।
చన్నులలరారెవలశర-చ్చంద్రముఖికి॥ ౧౦౨॥

క. లలితాధరమధురసుధా।
రలుగ్రోలఁగఁదలఁచిసుంద-రంబగునాభీ।
బిలమువెడలివచ్చినచీ।
మలబారనరోమరాజి-మగువకుఁదనరెన్॥ ౧౦౩॥

క. సురకన్యలసురకన్యలు।
గరుడోరగయక్షరాజ-కన్యలునరకే।
న్నరకన్యలెందరైనను।
గరిగమనకుదనుజరాజ-కన్యకుసరియే॥ ౧౦౪॥

క. మొగముసిరిగళముతీరును।
బిగిగుబ్బలబెడగునడుము-పేదరికమహో।
తగనింతింతనితెలుపఁగ।

నగునేనలుమోముసామ్ము-లయ్యునునైనన్॥ ౧౦౫॥

క. అనిపొగడఁదగినచక్కని।
తనకన్నియతోసుమాలి-తగభూలోకం।
బునమెలఁగుచునొకచోటం।
గనుగొనివైశ్రవణుఁబుష్ప-కస్థుఁగుబేరున్॥ ౧౦౬॥

ఉ. నావినియావినీలకచ-నమ్రతనంజలిసంఘటించిమ।
ద్భావమెఱుంగఁజాలుదువు-భవ్యతపోమహిమంబునన్ జగ।
త్పావనయేనుకైకసిని-దథ్యముసుమ్ముసుమాలికూఁతురన్।
హావిరినీదుసన్నిధికి-వచ్చితిమద్గురునాజ్ఞచొప్పునన్॥ ౧౨౨॥

క. మిగిలినకార్యంబెఱుఁగం।
దగుదువునీదివ్యదృష్టిఁ-దాపసయనియు।
మ్మగువవచించినట్లా।
త్తగతంబునెఱిఁగితపసి-మానినికనియెన్। ౧౨౩॥

సీ. కైకసినీమనో-గతవాంఛయెఱిఁగితి,
పుత్త్రిలాభముఁగోరి-పొసఁగనిపుడు।
ననుఁజెందితివినీవు-ననబోఁడితెలియంగ,
వివరింతులెస్సగా-వినుముక్రూర।
మైనసాయంసమ-యమునని ప్పుడునన్ను,
వరియించితివిపుత్త్రి-వాంఛఁగాన।
దారుణాకారుల-దారుణశీలురఁ,
గ్రూరకర్ములఁబాప-కుటిలమతుల।
గీ. దారుణాభిజనప్రియ-తములసుతుల।
రక్కసులఁగాంతువనిపల్కె-మొక్కికేలు।
దమ్ములుమొగిడ్చినొసలనం-దముగనిలిపి।
పలికెనిట్లనితపసితోఁ-గలువకంటి॥ ౧౨౪॥

క. మునికుంజరనీవలనం।
దనయులనీదృశులఁగాంచఁ-దగునేయనన।
మ్మునియనియెమత్కలోచిత।
ఘనమతియగుకొడుకుగలుగుఁ-గడపటనీకున్॥ ౧౨౫॥

గీ. వాఁడుధార్మికుఁడతిసాధు-వర్తనుండు।
సర్వశాస్త్రార్థతత్త్వవి-శారదుండు।

పౌలస్త్యపర్ణశాలకు।
లీలావతిచనియెహంస-లీలాగతులన్॥ ౧౧౪॥

క. చనిముని చెంగటలజ్జా।
వనతాననకమలయగుచు-వనితామణియు।
య్యనఘునిచరణాంగుష్ఠాగ్రం।
బుననవనిలిఖించుచుండె-ముదమెదగదురన్॥ ౧౧౫॥

క. ఆసమయంబునవంబురు।
హాసనకులదీపకుఁడుహు-తాశననిభతే।
జోసహ్యుఁడగ్నిహోత్రము।
హాసించెన్విశ్రవుండు-దంచితనిష్ఠన్॥ ౧౧౬॥

వ. అనంతరంబ ౧౧౭॥

మ. కనియెంజెంగటవిశ్రవుండపుడురా-కాచంద్రబింబాననన్।
ఘనవేణింబికవాణిఁగుందరదన-న్నవ్యప్రవాళాధరం।
దనుమధ్యన్మదకుంభికుంభపృథులో ద్యద్బాహుమూలంకష।
స్తనభారానమితాంగిహంసగమనన్-దైతేయకన్యామణిన్॥ ౧౧౮

క. కనిసొగసులగనియగున।
ద్దనుజేంద్రకుమారిచక్కఁ-దనమునకెంతే।
మనమునవచ్చెరువడియా।
మునిమొగమునవలతినగవు-మొలువంబలికెన్॥ ౧౧౯॥

క. లలనా తెలియంబలుకుము।
పొలయలుకవహించివల్ల-భున్ మొరగివన।
స్థలిలోనడాగవచ్చిన।
వలరాయనిసతివొకాక-వనదేవతవో॥ ౧౨౦॥

గీ. తరుణియెవ్వానిముద్దుకూ-తురవునీవు।
వచ్చితెచ్చటినుండినీ-విచ్చటికిని।
యేమికార్యంబుఁదలఁచినీ-వింతవనికి।
తెలుపఁగఁబలుకుమునిజముగా-నిందువదన॥ ౧౨౧॥

గీ. వాఁడు రావణుఁడన దశ-వదనుఁడనఁగ।
నామము వహించెనంతన-న్నలినముఖికిఁ।
గుంభకర్ణాహ్వయుండైన-కొడుకువొడమె।
నెంత రాకాశిశూర్పణఖాఖ్య పుట్టె॥ ౧౩౧॥

క. అంతట నుదయించెను గుణ।
వంతుఁడు శాంతుండు ధర్మ-వర్తనుఁడు దయా।
వంతుఁడు విభీషణాఖ్యుఁడు।
నంత సమాఖ్యుండు పశ్చ-మాత్మజుఁడగుచున్॥ ౧౩౨॥

వ. దశగ్రీవాదులైన వీరు విశ్రవుని పుత్త్రులు ఇది కారణంబుగ రావణకుంభకర్ణ వధంబున నక్లిష్టకర్ముండైన రామునకు బ్రహ్మహత్య ఘటించెనది గావున నందద్దోషశాంతికొఱకు రామేశ్వరలింగ ప్రతిష్ఠాపనంబు గావించి శ్రీరామచంద్రుండు కృతార్థుండయ్యె నిట్లు రామునకు నెచ్చోట బ్రహ్మహత్యా మోక్షంబయ్యెనది బ్రహ్మహత్యా విమోచనంబను తీర్థంబయ్యె నందున వగాహనంబుఁ గావించిన బ్రహ్మహత్యా వినాశనంబగు రావణుండు ఛాయారూపంబున నచ్చోట నేటికిం గానంబడుచుండు. ౧౩౩॥

గీ. దానిముందట నొకమహా-త్తరబిలంబు।
గలదు పాతాళమార్గమా-బిలమునందు।
రావణవధప్రసక్తయౌ-బ్రహ్మహత్య।
నుండునట్లుగఁ జేసెర-ఘూద్వహుండు॥ ౧౩౪॥

ఆ. ఆబిలంబుమీఁద-నమరంగ దుట్టాపం।
బొక్కటి చెవియందు-నుచితరీతి।
కాలభైరవునిన-ఖండితశాసను।
నిలిపె రక్షకొఱకు-నృపవరుండు॥ ౧౩౫॥

గీ. భైరవుని శాసనంబున-భయముఁజెంది।
దారుణోద్వేగమెడలియుం-తయుఁ గృశించి।

శాంతచిత్తుండుసద్గుణ-శాలియతఁడు।
కంబునిభకంఠిమదిసంశ-యంబువలదు॥ ౧౨౬॥

వ. ఇట్లు దివ్యజ్ఞానసంపన్నుండును, మహానుభావుండును, బ్రహ్మర్షిశేఖరుండును, షడ్గుణైశ్వర్యశాలియునగు విశ్రవుండు సుమాలికన్యయగు నక్కైకసికిం జెప్పి దానిం బరిగ్రహించె నవ్వరారోహయు సౌహార్దతియు, సౌందర్యవతియు, సౌభాగ్యవతియునై విశ్రవుని డెందంబున కానందంబు సంపాదింపుచు నభిమతసముచితోపచారంబులు గావింపుచుండె నంత నయ్యింతికిం గతిపయకాలంబునకు గర్భంబునిల్చిన. ౧౨౭॥

సీ. ఎనలేనివలిగుబ్బ-చనుమొనల్నలుపెక్కె,
సొగసుసైకపుగాను-జూడనయ్యెఁ।
గలికికన్నులయందుఁ-దెలిడాలురెట్టించె,
వెలిదమ్మిపోలికె-నలరెమోము।
కడునల్లనగుమనే-ర్పడియెలేనూగారు,
తరుచుకోరికలుడెం-దమునమొలిచె।
నోపికలేకని-ట్టూర్పులగ్గలమయ్యె,
నెమ్మేనఁజెమటలు-గ్రగమ్మెసారె।

గీ. పొదలెనెంతయునలయిక-నిదురమించె।
నడరెఁగూర్కులునడకలు-జడనుపడియెఁ।
దళుకుఱెప్పలుసోమరి-తనముఁబూనె।
నెగడెనొకచెల్వపొద్దులు-నిండెసతికి॥ ౧౨౮॥

వ. అంత ౧౨౯

మ. కనియెంగైకసిపుత్త్రినున్నదుమహా-కాయున్ మహోగ్రున్ దశా।
ననువింశద్భుజకాండుఁగృష్ణవదనుం-దామ్రాధరున్ భీకరున్।
ఘనదంష్ట్రాన్వితుభూమిభారకరుర-క్తశ్మశ్రుకేశున్మదాం।
ధునిలోకాంతకునాదితేయవిమతున్-దుర్వృత్తునన్ రాక్షసున్॥

నెమ్మి రామేశ్వరంబున-నిలిపి రాముఁ
డొసఁగె వారికిఁ గ్రామంబు-లురుధనంబు॥ ౧౪౦॥

శా. నైవేద్యార్థము రామచంద్రుఁ డొసఁగెన్-నానావిధగ్రామముల్।
దేవగ్రామమణి రామలింగమునకున్-దేదీప్యమానంబులౌ।
గ్రైవేయాంగదరత్నకుండలవరీ-హారావళుల్ చంద్రికా।
ధావళ్యప్రహసద్దుకూలపటముల్-దాల్పంగ నిచ్చెంగడున్॥ ౧౪౧॥

వ. ఈయుపాఖ్యానంబు వినినవారికిఁ పఠించినవారికి సకలపాపక్షయకరంబగు. శరీరాంతంబున హరిసాయుజ్యంబు సిద్ధించు నని సూతుండు శౌనకాదిమహర్షులకు వివరించె॥ ౧౪౨॥

మ. కరుణాసాగర కామదర్పహర లో-కత్రాణదీక్షాధురం
ధరగర్వాంధజలంధరాంధకమహా-దైతేయసంహారని।
ర్జరసంసేవితపాదపద్మ మునిరా-జస్వాంతరాజీవసం।
చరదిందిందిర యిందుశేఖర సదా-చారప్రతిష్ఠాపకా॥ ౧౪౩॥

క. పుష్కరలోచనలోచన।
పుష్కరపూజావిధాన-భూషితచరణా।
పుష్కరభవముఖమందుర।
పుష్కరనిధిరాజతూణ-భూషణధురీణా॥ ౧౪౪॥

పృథ్వీవృత్తము.
ధరాధరసుతాపయో-ధరవివిక్తకస్తూరికా-
స్ఫురత్ప్రమరవాసనా-సురభితోరుదోరంతరా।
ఛరచ్ఛరదసత్సంఘా-శరదచేందుమందాకినీ।
సురద్రుమసుమాళిభా సుందరీరంగాకృతీ॥ ౧౪౫॥

యాగభీరబిలంబున-నణఁగియుండె।
బ్రహ్మవిదులార రావణ-బ్రహ్మహత్య॥ ౧౩౬॥

సీ. శ్రీరామనాథున-క్షిణమునననిశంబు,
నిండు వేడుకతోడ-నుండు గౌరి।
యుభయపార్శ్వములందు-నుండి సేవింతురు,
భక్తిచేఁ జంద్రుండు-భాస్కరుండు।
బ్రోలవహ్ని వసించు-ముదమునఁ దూరుపు,
మొదలైనదిశలందు-గదిసి వరుస।
నమరనాయకముఖ్యు-లష్టదిక్పాలకుల్,
వర్తింపుదురు హృష్ట-వదనులగుచు।

గీ. భవునితనయులు గణనాథ-బాహులేయు।
లిద్దఱుభజింపుచుందుర-హీనభక్తిఁ।
బరమమాహేశ్వరులు వీర-భద్రముఖులు।
తగినయెడలవసింతురా వరముతోడ॥ ౧౩౭॥

భుజంగప్రయాతము

సురల్పన్నగుల్ దాన-సుల్ చారణుల్కి-।
న్నరుల్సిద్ధసాధ్యాది-నాకౌకసుల్ద।
త్పరత్వంబునన్సంత-తశ్రీశ్రీరామే।
శ్వరుం గొల్తురిష్టార్థ-సంసిద్ధికర్తన్॥ ౧౩౮॥

క. సరయూయమునాగంగా।
సరస్వతులు రామనాథు-జగదారాధ్యుం।
బరమేశు సేతువునఁ ద।
త్పరతభజింపుము స్వకీయ-పాపచ్యుతికిన్॥ ౧౩౯॥

గీ. భువనముల రామనాథునిఁ-బూజసేయు।
పూజకులశ్రోత్రియులువిప్ర-పుంగవులను।

భవహరము గు రామేశ।
స్తవ రాజం బిది వినుండు - శ్రద్ధాయుక్తిన్॥ 3॥

క. శ్రీపతి రాముఁడు లింగ।
స్థాపన మొనరించి యందు - సర్వేశ్వరుగా।
రీపతినిఁ బాపహరుఁ గరు।
ణాపరు రామేశుఁ బొగడె - భక్తి దలిర్పన్॥ 4॥

గీ. మఱియు సౌమిత్రియును లోక - మాన్యజాన।
కియును సుగ్రీవముఖులైన - కీశవరులుఁ।
గమలజాదిసుపర్వుల - గస్త్యముఖ్య।
మునులు వేర్వేఱఁ బొగడిరి - మ్లను చు శివుని॥ 5॥

వ. రాఘవుం డిట్లనియె. 6॥

క. మ్రొక్కెద మహాత్మునకు జానకు।
మ్రొక్కెద మహామాయునకున - మోఘేచ్ఛునకున్।
మ్రొక్కెద్ద త్రిశూలికి భవునకు।
మ్రొక్కెద మహేశునకుఁ బంచ - ముఖునకు నీకున్॥ 7॥

క. హరిభుజంగమ పరివృఢ।
హరికి నిజకింకరార్తి - హరికి హిమరు।
గ్ధరికి సుమాయు ధారికిఁ।
జేరి ప్రణామములు నీకుఁ - జేసెద నభవా॥ 8.

సీ. అఖిలరూపునకు దే - వాది దేవునకును,
శ్వేతునకు సాక్షికి - శంకరునకు।
వేదాంత వేద్యన - కాదిశూన్యునకువి,
జ్ఞాన దాయకునకు - శంభునకును।
నందివాహనునకా నందపూర్ణునకువి,
శ్వాధీశ్వరునకుఁ బ - రాకృతికిని।

గద్య:— ఇది శ్రీమదుమామహేశ్వర కరుణాకటాక్షవీక్షాపాత్ర, యేనుగ లచ్చయామాత్యపౌత్ర తిమ్మనామాత్యపుత్త్రి, వివిధ విద్వజ్జనవిధేయ, లక్ష్మణకవినామధేయ ప్రణీతంబయిన రామేశ్వరమాహాత్మ్యంబను మహాప్రబంధము నందుఁ ద్వితీయాశ్వాసము.

శ్రీ. శ్రీ. శ్రీ.

శ్రీరస్తు.

---

# రామేశ్వరమాహాత్మ్యము.

## చతుర్థాశ్వాసము.



మల్లనమంత్రిమనః।
కామితఫలదాయికల్ప-కద్రుమశుభకృ।
న్నామగురుజానపల్లీ।
ధామామల్లేశలింగ-ధరణీశతాంగా॥ ౧॥

వ. అవధరింపుము శౌనకాదిమహర్షులకు సూతుండిట్లనియె. ౨॥

క. అవనిసురులారయిప్పుడు।
వివరించెద నేను మీకు-విస్పష్టముగా।

పతయేచతస్కరాణాం।
పతయేరుద్రాయసాధు-పతయేస్తునమః॥ ౧౩॥
గీ. కర్తవశమునవెక్కడై-కన్పడజనించు।
వచటనచ్చటనాకునీ-యంఘ్రికమల।
భక్తిసిద్ధించుగాతగో-పతితురంగ।
యిందురేఖోత్తమాంగరా-మేశలింగ॥ ౧౪॥
క. వేదాచారాభిరతియు।
వేదాన్యవిరుద్ధమార్గ-విముఖతయునుసు।
పాదింపుము నాకుఁగృపా।
మేదురవీక్షణము చేత-మీనాంకహరా॥ ౧౫॥
పంచచామరము.
హరాసురాద్రిచాపపాప-హారినామధేయశం।
కరాకరాంచితత్రిశూల-కాలకాలనీలకం।
ధరాధరాశతాంగతార-తారహారతారకా।
మరాళహీరగౌరధీర-మాన్యనీకుమ్రొక్కెదన్॥ ౧౬॥
గీ. పరమకారణశంకర-ఫాలనయన।
గిరిసుతాకుచకుంకుమాం-కితసువక్ష।
విశ్వనాయకరామేశ-విపమబుద్ధి।
మాన్పసన్నతియొసఁగుము-మదనమదన॥ ౧౭
మత్తకోకిల.
నీలలోహితపార్వతీప్రియ-నిమ్నగాధరధూర్జటీ।
ఫాలలోచనదాససంసృతి-బంధమోచనసంస్కృతీ।
శూలహస్తనిరస్తమాయవి శుద్ధరూపకృపానిధీ।
బాలచంద్రకిరీటనీపద-భక్తినాకునొసంగుమీ॥ ౧౮॥
వ. సీతాదేవియిట్లనియె. ౧౯॥
తోటకవృత్తము.
దితిజాంతకవిశ్వప-తీశరణా।

భక్తభయచ్ఛేద-పరమకారణపాద,
పద్మరేణువకుస-ద్బాంధవునకు।
గీ, భర్గునకుఘోరపాతక-భంజనునకుఁ।
గాలకాలునకద్భుత-శీలునకును।
గాలునకుశర్వునకునీల-కంధరునకు।
రామనాథేశునకునీకుఁ-బ్రణుతి సేతు॥ ౯॥
వ అవిద్యానిహంతకుం బాపహరునకు, సంసారసంతాప శాంతిహేతునకు మదీయబ్రహ్మహత్యావినాశకిం బార్వతీ నాథునకుం గైలాస నిలయునకు, గంగాధరునకు, విరూపాక్షునకు నిరాకృతరసాపదునకుం బినాకపాణికి, మదనహరునకుం బునః పునః ప్రణామంబులు గావింతు. ౧౦.
వ. లక్ష్మణుండిట్లనియె॥ ౧౧॥
సీ. రామనాథాయపు-రచ్ఛిదేశంభవే,
పరమేశ్వరాయతు-భ్యంనమోస్తు।
పర్వతకన్యకా-పతయేనమోస్తుతే,
నాగేంద్రముఖగుహ-నందనాయ।
రవిశశివహ్ని నే-త్రాయకపర్దినే,
దేవాయసోమాయ-తేనమోస్తు,
కరుణార్ణవాయమా-ర్కండేయభవభిదే,
విభవేనమస్తేక-విస్తుతాయ।
గీ సాక్షిణేనమఉగ్రాయ-శంకరాయ।
నీలకంఠాయభీమాయ-నిర్మలాయ।
శూలినేసకలజ్ఞాయ-సుదిరాయ।
మదనవీర్యహరాయన-మశ్శివాయ॥ ౧౨॥
క. క్రతుపురుషాయగణాద్యధి।
పతయేవరదాయదుర్గ-భాయవనానాం॥

వ. నలుండిట్లనియె ౩౦॥

క. జలజాసనహరిరుద్రులు।
వలనుగ నెవ్వానిమాయ-వర్తింతురని।
ర్మలరూపునతనిమాయా।
విలసనవిరహితుని రామ-విభునిఁదలంతున్॥ ౩౧॥

వ. కుముదుండిట్లనియె. ౩౨॥

క. నానాజగదుద్గతికిఁబ్ర।
ధానము కారణమటంచుఁ-దగఁజెప్పిరియే।
వ్వాని నెఱుంగక బుధులుని।
దానాత్ముని వానిఁదలఁచె-దన్ రామేశున్॥ ౩౩

వ. పనసుండిట్లనియె. ౩౪॥

గీ. పొసఁగ నెవ్వానిమాయచేఁ-బొడమె జాగ్ర।
దాదివిశ్వప్రపంచమ-త్యద్భుతముగ।
నతని విజ్ఞానఘనుజాగ్ర-దాదిరహితుఁ
రామనాథుని సేవింతుఁ-బ్రేమమెసఁగ॥ ౩౫॥

వ. గజుండిట్లనియె. ౩౬॥

గీ. కారణాత్మకు నెవ్వనిఁ-గానలేక!
కడగిపరమాణువులుజగ-త్కారణమని।
తార్కికులుగలహింతు రా-తనిసుఖాత్ము।
నాత్మరూపుని రామేశు-నాశ్రయింతు॥ ౩౭॥

వ. గవాక్షుండిట్లనియె ౩౮॥

గీ. పటుతరాజ్ఞానపాశని-బద్ధనరులఁ।
బాశముక్తులఁగావించు-పరమగురుని।
రామనాథుని శాంతుశ-రణ్యు శివుని।
రక్షకునిఁజేరికొల్తుని-రంతరంబు॥ ౩౯॥

వ. గవయుండిట్లనియె ౪౦॥

గతపాలకనిత్యవి-కాసనిధీ।
నతినీకురచించెద-నాకెపుడుం।
బతిభక్తియొసంగుము-భవ్యమతీ॥ ౨౦॥

వ. హనుమంతుం డిట్లనియె ౨౧॥

గీ. దేవదేవజగన్నాథ-దీనపాల।
రామనాథకృపాధార-రాజమకుట।
తావకీనపదాంబుజ-ద్వయమునందుఁ।
బట్టుపడుగాతనిశ్చల భక్తినాకు। ౨౨॥

క. నానాప్రపంచసత్తా।
భానము లెవ్వానివిడిచి-భాసిల్లవుత।
ధ్యానాత్ము రామనాథుని।
మానాయకుఁగొల్తునెపుడు-మానసవీథిన్॥ ౨౩॥

వ. అంగదుఁ డిట్లనియె ౨౪॥

గీ. వెలుఁగు నెవ్వానివెలుఁగున-విశ్వమెల్ల।
వెలుఁగదిజగమెవ్వాని-వెలుఁగులేక।
అట్టిరామేశునకుభయ-హారునకమర।
వంద్యునకుశంభునకునీకు-వందనంబు॥ ౨౫॥

వ జాంబవంతుం డిట్లనియె. ౨౬॥

క. మానుగనేపరమేశ్వరు।
నానందముగనుటచేస-మస్తానందం।
బైనెగడునమ్మహాత్ముస।
దానందుని రామనాథు-నాత్మభజింతున్॥ ౨౭॥

వ. నీలుండిట్లనియె. ౨౮॥

ఆ. దేశకాలభేద-దిగభిన్నమేవస్తు।
వద్వితీయమగుచు-నమరునెద్ది।
అట్టిభేదవిరహి-తాత్మునీశ్వరురామ।
నాథునభవులోక-నాథుఁగొల్తు॥ ౨౯॥

చున్న నన్నుద్ధరింపుము - తూర్యజిత్తాంగ।
వృషభరాజతురంగ రా-మేశలింగ॥ ౪౬॥

వ. విభీషణుం డిట్లనియె. ౪౭॥

మ. జననవ్యాఘ్రము పాపసింహమతిదు-ష్టవ్యాధిచోరంబు నా।
శనసర్పాకులమింద్రియార్థనగమీ-ర్ష్యాపర్ణముల్ బాల్యయా।
వనకూపంబును భీతికంటకముదు-ర్వారోగ్రసంసారకా।
ననముం జొచ్చితి ధర్మమార్గము జగ-న్నాథా కృపం జూపవే॥ ౪౮॥

వ. సర్వవానరు లిట్లనిరి.

శా. పాపంబెల్లెడఁ గూర్చి ఖేదము జనిం-పక్క యోనులం బుట్టికుం।
భీపాకాదిదురంతదుర్గతుల నొ-ప్పిం జెందియా పిమ్మటం।
బాపోత్కృష్టనికృష్టయోనితతులం-బల్మాఱు జన్మించిని।
త్వాపన్నత్వముసంగ్రహించితిమి దే-వా మమ్ము రక్షింపవే॥ ౫౦॥

గీ. ఘోరగంభీరసంసార-కూపగతుల।
జడుల వివశుల దీనుల-చపలమతుల।
కడున నాథుల మము నీవు-కరుణఁ జూచి।
కావవే యీశ రామేశ-గగనకేశ॥ ౫౧॥

స్రగ్విణీమిళితభుజంగప్రయాతము.

హరా। భక్తమందార-యా-పన్నరక్షా।
పరా। ముక్తసంగాకృ-పా-ముగచర్మాం।
బరా। శుక్తిముక్తాప్రభా-శోభితాంగా।
పరా। వ్యక్తచిన్మాత్ర-భా-వాపురీశా॥ ౫౨॥

క. రక్షింపుము కరుణార్ణవ।
రక్షింపుము దీనపాల-రాజకిరీటీ।
రక్షింపుము భువనేశ్వర।
రక్షింపు మమ్ము దేవ-రామేశశివా॥ ౫౩॥

వ. బ్రహ్మ యిట్లనియె ౫౪॥

ఉత్సాహము

ధ్వస్తపురపిశాచరుణ్ సు-ధాకరార్ధమౌళిస్వా।
ధ్వస్తవిశ్వవిశ్వనాథు-నాగమాంతవేద్యవ।
ధ్వస్తయోగసుజనగమ్యు-నాదిదేవునీశ్వరుం।
బ్రస్తుతింతు రామనాథుఁ-బార్వతీమనోహరుణ్॥ ౪౧॥

వ. శరభుండిట్లనియె ౪౨॥

ఆ. పరమరేణువాత్త-పరమార్థమనుచునె।
వ్వాని మోహశక్తి-వశముఁ జెంది।
పలుకుదురు విబుధ-భావులప్పరమాత్ము।
రామనాథునమిత-ధాము నెంతు॥ ౪౩॥

వ. గంధమాదనుండిట్లనియె

భుజంగప్రయాతము.

సమస్తాఘసంఘాత-శాంత్యర్థనుంబా।
సమేతుణ్ గణాధీశుఁ-జంద్రార్ధమౌళిణ్।
రమానాథ బాణుణ్ సు-రత్రాణదక్షుణ్।
నమత్సేవధిణ్ రామ-నాథుం భజింతున్॥ ౪౪॥

వ- సుగ్రీవుండిట్లనియె ౪౫॥

సీ. జన్మజరామృత్యు సలిలప్రపూరంబు,
సంతాపబడబాగ్ని-సంకులంబు।
దారపుత్రక్షేత్ర-ధనవీచినికరంబు,
దుష్టరోగవ్యాళ-దుస్సహంబు।
కామాదిపరిపంథి-గణఘోరమకరంబు,
విషయస్పృహాఫేన-విలసనంబు।
బహుళదారుణవిప-త్పాఠీనవారంబు,
మజ్జదజాండకకుం-భవ్రజంబు।

గీ. భవదుదారపదాంభోజ భక్తిపోర।
మనఁగఁదగు భవజలరాశి-యందు మునుఁగు।

నీకు నంజలిఁ గావింతు - నిష్ఠతోడఁ
గరుణఁ జూడుము భువనేశ - కలుషనాశ॥ ౧౫॥

వ. సోముం డిట్లనియె. ౧౬।

క. శూలికి గుణశాలికి ఫణి
మాలికి శశిమౌళికి న్న - మంచితభసితో
ద్ధూళితునకుఁ బాలితది
క్పాలకునకు రామనాథ - భవునకు జేజే॥ ౧౭॥

వ. అగ్ని యిట్లనియె. ౧౮।

మాలిని. హరిహయముఖదిక్పా - లావళీభర్మమౌళి
స్ఫురదురుమణితేజః పుంజనీరాజితాంఘ్రిన్।
తరుణశిశిరభానూ - త్తంసు దిగ్వాసు నీశున్।
నిరతము మదినుంతు - నిష్ఠతో రామనాథున్॥ ౧౯॥

వ. వాయు విట్లనియె. ౨౦।

క. హరునకు హరిరూపునకుం
బరమాత్మకు వ్యాఘ్రచర్మ - పటునకు రామే
శ్వరునకు నీకుఁ బ్రణామం
బురుకృపతో నాకభీష్ట - మొసఁగుము రుద్రా॥ ౨౧॥

వ. బృహస్పతి యిట్లనియె. ౨౨।

వ. చింతాతీతాత్మునకున్
హంతా సాక్షికిని బ్రత్య - గద్వయునకు మా
కాంతునకు వందనంబులు
భ్రాంతినివృత్తికి నొనర్తు - రామేశునకున్॥ ౨౩॥

కందమిళితమణిగణనికరవృత్తము.

జలరుహభవనుత - చరణక । మలని
ర్మలగుణమణిగణ - మదనమదహరా
వలయితవిషధర - వరగిరి । నిలయా
నెలకొని కొలిచెద - నినుముదితభవా॥ ౨౪॥

గీ. కవిజనస్తుతయేణాంక-కలితచూడ।
యీశలక్ష్మీశసఖహరి-దీశవంద్య।
సదయకలిహరహాలహ-సర్వకామ।
సకలభవప్రణవాత్మక-శరణుశరణు॥ ౫౫॥

వ. ఇంద్రుండిట్లనియె ౫౬॥

గీ. ఏమహాత్మునిశక్తిభ-క్తిప్తధాత్రి।
విశ్వమాతయుమాదేవి-వేదమూర్తి।
యతనిజగదేకనాయకు-నమితతేజు।
శంకరునిరామనాథుని-సంస్మరింతు॥ ౫౭॥

వ. యముండిట్లనియె. ౫౮॥

క. సూనులుగజముఖగుహులె।
వ్వానికివృషభేశ్వరుండు-వాహనమతనిన్।
శ్రీనిధిరామేశ్వరున।
జ్ఞానివృత్తికిభజింతు-జగదేకగురున్॥ ౫౯॥

వ. వరుణుండిట్లనియె. ౬౦॥

క. పూనిమృకండునిసుతుఁడె।
వ్వానింబూజించివైభ-వముఁగృతాంతా।
ధీనుఁడుగాడద్దేవున।
దానందునిఁదలఁతుమృత్యు-హరురామేశున్॥ ౬౧॥

వ. కుబేరుండిట్లనియె ౬౨।

క. లాక్షారుణదేహునకుం।
జక్షుశ్శ్రుతికుండలునకు-సర్వేశునకున్।
రక్షకునకురామేశున।
కక్షురునకుఁబ్రణుతిసేతు-నచలితభక్తిన్॥ ౬౩॥

వ. ఆదిత్యుండిట్లనియె. ౬౪।

గీ. రామనాథమహాదేవ-సోమచూడ।
దక్షయజ్ఞవినాశన-భర్గరూప।

గనుఁగొన మోక్షహేతువులు-గావటుగాన విరక్తిఁ గోరదగ్।
ఘునకృపనాకొసంగుము జ-గచ్ఛుభదాయక రామనాయకా॥ ౧౪॥

వ. విశ్వామిత్రుం డిట్లనియె. ౧౫॥

చ. మఱిఁ జొరవిన్న శాస్త్రిమత-మర్మములుం జదువంగఁ బడ్డ్రబా।
జదువులు నిష్ఫలంబులగు-సత్యము మర్త్యునకెల్లెడన్భవ।
త్పదజలజాతనిశ్చలిత-భక్తిమహత్వము లేనివానికిన్।
సదమలబోధరూపశివ-శర్వమహేశ్వర రామవేశ్వరా॥ ౧౬॥

వ. గంధర్వు లిట్లనిరి ౧౭॥

శా. ఆనందాత్మక రామనాథ భవదీ-యాంఘ్రిద్వయీవందన।
ధ్యానాసక్తులు గానిమానవులకుం-దథ్యంబుగా నేరికిన్।
దానంబుల్ మఖముల్ తపోనియమముల్-ధర్మంబులున్నిష్ఠలున్।
స్నానాతీర్థనిమజ్జనప్రముఖపు-ణ్యంబుల్ దుర్వ్యర్థముల్॥ ౧౮॥

వ. వసిష్ఠుం డిట్లనియె. ౧౯॥

ఉ. పాపము లాచరించియును-బాయక మర్త్యుఁడు రామనాథని।
న్నోపికఁ జేరి భక్తిభర-ముల్లసిలం బ్రణమిల్లెనేనిఁ దా।
త్పాపసమూహ మంబుసహ-బాంధవబంధురదీప్తిపుంజని।
ర్వ్యాపితఘోరసంతమస-రాశిగతిన్ లయ మొందు గొబ్బునన్॥ ౨౦॥

వ అత్రి యిట్లనియె ౨౧॥

క. రామేశ నిన్నుఁ జూచి ప్ర।
ణామముఁ గావించి కొలుచు-నరుఁ డురుబాధా।
ధామము సుమాతృగర్భపు।
హోమధ్యము మగుడఁ జొరక-నమృతము జెందున్॥ ౨౨॥

గీ. జనుఁడు నినుఁ జేరి మ్రొక్కు-చుఁ దనదుబంధు।
వర్గముల నెవ్వఁ డూదలంచు-వారిదురిత।
విగహితులఁ జేయుననఁగ న-న్నఁడు ధన్యుఁ।
డగుట చిత్రమె రామేశ-యభ్రకేశ॥ ౨౩॥

లయగ్రాహి.

కేశవచతుర్ముఖసు-రేశనుతపాదభవ-పాశహరవిష్ణుపద-కేశరవినతు।
త్రేశశిఖిలోచనగి-రీశకుసుమాయుధవి-నాశను నిమానసని-వేశజననాది।
క్లేశభయనాశనహు-తాశనజటీధరజి-తాశవలయీకృతబిలేశయవతీరా
మేశశరదిందుఘన-కాశనిభదేహపల-లాశమదభంజనని-రీశనినుగొల్తున్

వ. శుక్రుండిట్లనియె. ౯౬॥

ఆ. సుకృతియోగిలభ్య-నకుమహోమాత్రార్థ।
రూపునకుసదాగ్ర్య-పాపరునకు।
ద్వైతహీనునకుగు-ణాతీతునకురామ।
నాథదేవునకునో-నర్తునతులు॥ ౯౭॥

వ. అశ్వినేయులిట్లనిరి. ౯౮॥

ఆ. పరమయోగిహృదయ-పద్మములనాత్మభా।
వమునవెలుఁగుచున్న-వానిశివుని।
విభుననన్యభాస-వేద్యునీశ్వరరామ।
నాథుఁగొల్చెదముబ్ర-ణామకలన॥ ౯౯॥

వ. అగస్త్యుండిట్లనియె ౧౦౦॥

గీ. ఆదిదేవమహాదేవ-యనఘవిశ్వ।
నాథయవ్యయశివరామ-నాథదేవ।
యంబికానాథవృషభాంక-హరక్షమింపు।
మస్మదపరాధసాహస్ర-మసురవంద్య॥ ౧౦౧॥

క. దారాపత్యక్షేత్రా।
గారద్రవిణములయెడన-ఖండితకరుణా।
ధారయహంకారమమ।
కారములేకుండనాకుఁ-గరుణింపఁగదే॥ ౧౦౨॥

వ. సుతీక్ష్ణుండిట్లనియె. ౧౦౩॥

చ. ధనములురత్నసంతతులు-ధాన్యములున్సుతమిత్రవర్గముల్।
వనితలుగోగణంబులును-వస్త్రచయంబును క్షేత్రగేహముల్।

నన్నుఁ జేర్చుము సచ్చిదా-నందమయవి।
రాజితనిజాంఘ్రికమలంబు-రామనాథ॥ ౧౦౨॥

వ. గంధర్వులిట్లనిరి. ౧౦౩॥

గీ. దుఃఖకల్లోలమాలికా-దుస్తరోగ్ర।
పారరహితభవాంబుధి-బడినమాకుఁ।
దావకపదాంబురుహభక్తి-తరణిదక్క।
నన్యగతిలేదు రామేశ-హరనిరీశ॥ ౧౦౪॥

వ. కిన్నరులిట్లనిరి. ౧౦౫॥

క. ఆమయశార్దూలభయో।
ద్దామభవాటవిని వెతలఁ-దగిలినమాకున్।
రామేశ్వరలింగ మని।
స్తోమార్చిత మంచిత్రోవఁ-జూపుము కరుణన్॥ ౧౦౬॥

వ. యక్షులిట్లనిరి. ౧౦౭॥

గీ. రామనాథేశ యింద్రియా-రాతులధిక।
దర్పమున నేచుచున్నారు-తాళలేము।
వారినణఁగించి విజయమొంద-వలయుఁగాన।
గరుణదీపింపఁ బాసట-గమ్ము నీవు॥ ౧౦౮॥

వ. నాగేంద్రులిట్లనిరి. ౧౦౯॥

గీ. నీమహత్వమచింత్యంబు-నీలకంఠ।
యల్పమతులము మేము మ-హానుభావ।
యెట్లు నుతి సేయఁగలము ని-న్నిందు చూడ।
ప్రణుతిఁగావించెదము నీకు-రామనాథ॥ ౧౧౦॥

వ. కింపురుషులిట్లనిరి. ౧౧౧॥

క. కట్టువడి వివిధయోనులఁ।
బుట్టుచు గిట్టుచును వెతలఁ-బొందితిమహహా।

వ. గౌతముండిట్లనియె. ౯౪॥

మాలిని. ఇదిపరమరహస్యం-బెప్పుడుం దావకాంచ।
త్పదకమలసపర్యా-తత్పరుం డైనవానిం।
జెదరనిదృఢభక్తిం-జేరి సేవించువారుం।
బొదలుదురుకృతార్థీ-భూతులై రామనాథా॥ ౯౫॥

గీ. ఎఱుఁగఁదగునిన్ను నిర్మల-హృదయులైన।
వివిధ వేదాంత వాక్యార్థ-విదులచేత।
భ్రాంతి దేరంగ సర్వశా-స్త్రములు విడిచి।
కొల్వ నెలెనిన్ను రామేశ-కుధరచాప॥ ౯౬॥

వ. వ్యాసుండిట్లనియె ౯౭॥

రథోద్ధతావృత్తము.
దీనపాలభవ-దీయసత్పద।
ధ్యానసంహృతస-మస్తపాపుఁడై।
మానవుండజును-మాయయుతున్నవ్యయం।
భానుఁజెందుముని-భావితున్నినుఁ॥ ౯౮॥

చ. వ్రతములునోచనేలయుప-వాసములుండఁగనేలశాస్త్రప।
ద్ధతులెఱుఁగంగనేలనిర-తంబునుగంగమునుంగనేలస।
త్క్రతువులుసేయనేలఫణి-రాజవిభూషణరామనాథశా।
శ్వతునకుబోధకారణభ-వత్పదసేవకులైనవారికిన్॥ ౯౯॥

గీ. రమ్యభోగాపవర్గఫ-లప్రదంబు।
ఘోరపాదికనరకని-వారకంబు।
తారకంబిట్టినీపద-ద్వంద్వభజన।
మేలపిడనాడురసికుఁడె-హీనభూష॥ ౧౦౦॥

వ. అంగదుండిట్లనియె. ౧౦౧॥

గీ. విశ్వనాయకమంత్రాణ-విలయవేళ।
గౌరితోఁగూడనీవుశీ-ఘ్రముగవచ్చి।

వ సాధ్యులిట్లనిరి.

గీ స్వాతిరిక్తవిహీను నా-ద్యంతరహితు।
విశ్వసత్తాప్రదాయకు-విగతమోహు।
సేవకాజ్ఞానభేదను-దేవునభవు।
స్వామినర్చించెదము భక్తి-రామనాథు॥ ౧౨౧॥

విద్యున్మాలావృత్తము.
శ్రీరామేశా-చిన్మాత్రాత్మా।
ధీరోపాశ్యా-ధీమధ్యస్థా।
గౌరీనాథా-కంఠేకాలా।
శ్రీరమ్యాంగా-జేజేనీకున్॥ ౧౨౨॥

వ. వానరులిట్లనిరి. ౧౨౩॥

సీ సచ్చిదానందుని-శ్చలునద్వితీయున,
నంగునిబ్రహ్మాత్ము-సంగశూన్యు।
నవికారు నాదిమ-ధ్యాంతవర్జితుఁబరి,
శుద్ధుసనాతను-బుద్ధునంత।
తిక్షాదిజగదేక-సాక్షినసంతుఁబ,
రామృతరూపుస్వ-యంప్రకాశు।
నప్రమేయునచింత్య-నసఘు నావిర్భావ,
సంకోచరహితువి-జ్ఞానకరుని।

గీ. నిత్యనిర్లేపునిష్క-ళు-నిరుపమాను।
విగతకర్మఘనానందు-విభుమహాత్ము।
దేవు రామేశు నెపుడుఁజిం-తించెదము స।
మస్తపాపక్షితికిమాన-సాబ్జసీమ॥ ౧౨౪॥

స్రగ్ధర.
శ్రీరామేశున్ రమేశా-శ్రితచరణుఁగృపా-సింధుబిశ్వల్లలాటున్।
గౌరీవక్షోజలిప్తా-గరుసురభితవ-క్షస్స్థలున్ వ్యోమకేశున్।

పుట్టువు చావును మాన్పుము।
మట్టుగ రామేశలింగ-మధితానంగా॥ ౧౧౨॥

చతుర్విధకందము.

శ్రీరామనాథ సరసవి।
హారాకరుణాసముద్ర-యాశ్రితవరదా।
గౌరీశ సౌమ్యవదన పు।
రారిహరశరణుశరణు-హరినుతచరణా॥ ౧౧౩॥

వ. విద్యాధరులిట్లనిరి ౧౧౪॥

క. శతధృతిసారధికిశివా।
పతికినసంగునకువృషభ-పతికేతునకున్।
శితికంధరునకునీకును।
నతులొనరించెదము రామ-నాథమహేశా॥ ౧౧౫॥

వ వసువులిట్లనిరి. ౧౧౬॥

క గణబృందపూజితాంఘ్రికి।
గణనాథునకమరనిమ్న-గాధరునకుని।
ర్గుణునకు రామేశ్వరునకుఁ।
బ్రణామమిదె నీకుమమ్ముఁ-బాలింపు శివా॥ ౧౧౭॥

వ. విశ్వదేవతలిట్లనిరి. ౧౧౮॥

గీ. జ్ఞప్తిమాత్రైకనిష్ఠులౌ-సంయములకుఁ।
బునరుదయశూన్యమగునట్టి-భూయమిచ్చు।
వానికినిహాంబునకునీకు-వందనంబు।
ప్రేమమునమమ్మురక్షింపు-రామనాథ॥ ౧౧౯॥

గీ. తత్త్వములకెల్లనుత్తమ-తత్త్వమగుచు।
వస్తుతత్త్వస్వరూపుఁడౌ-వానిసాధ।
నాంతరాపేక్షలేకస్వ-యంప్రకాశుఁ।
డైనరామేశుఁగొల్చెద-ననుదినంబు॥ ౧౨౦॥

వలన శబ్దస్పర్శగుణకంబగు వాయువు జనించె, వాయువువలన శబ్దస్పర్శరూప గుణకంబగు నగ్నిపొడమె, నగ్నివలన శబ్దస్పర్శ రూపరసగుణకంబగు జలంబుదయించె, జలంబువలన శబ్దస్పర్శ రూపరసగంధగుణకంబగు పృథివీభూతంబు జనించె నిట్టి పంచ సూక్ష్మభూతంబుల సత్త్వగుణసమష్టిభావంబున మనోబుద్ధిచిత్తాహం కారాత్మకంబగు నంతఃకరణంబు సృజింపంబడియె. సత్త్వగుణవ్య ష్టిభావంబున శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణంబులన శబ్దస్పర్శ రూపరసగంధగ్రాహకంబులగు పంచజ్ఞానేంద్రియంబులుద్భవించె. రజోగుణసమష్టిభావంబునం బ్రాణాపానవ్యానోదానసమానంబు లనఁ బంచప్రాణంబులు జనించె రజోగుణ వ్యష్టిభావంబున వాక్పాణి పాద పాయూపస్థంబు లన వచనా దాన గమన విసర్గానంద విషయకంబు లగు పంచ కర్మేంద్రియంబులు సంభ వించె నిట్టి జ్ఞాన కర్మేంద్రియ దశకంబును, ప్రాణ పంచకం బును, మనోబుద్ధి ద్వయంబును, సప్తదశకం బగు లింగశరీ రం బయ్యె. సూక్ష్మ భూతంబు లైదునుం బంచీకృతంబులై స్థూలంబులనంబరగ నీస్థూల భూతపంచకంబువలనం జతుర్దశ లో కసహితంబును, సమస్తద్వీపసమన్వితంబును, మేరుమందరహిమవ దాది పర్వత సంయుక్తంబును, దేవ దానవ నర పశు పక్షి మృ గాది జంతుసమేతంబును, బహువిధ స్థావర సంకులంబును, విచి త్రంబునునగు బ్రహ్మాండంబుసంభవించె. రజోగుణంబున బ్రహ్మవై సృజియింతువు సత్త్వగుణంబున విష్ణుండవై పాలింతువు త మోగుణంబున రుద్రుండవై హరింతువు. నీవ జాగ్రత్స్వప్నసుషు ప్త్యవస్థాత్రయంబును, స్థూలసూక్ష్మ కారణ దేహాభిమానంబువహిం చి విశ్వతైజసప్రాజ్ఞ నామంబులు ధరించి క్రీడింతువు. పారా వారంబునం దరంగంబుల చందంబున, గగనంబున మేఘంబులతె రంగునఁ బతంగబింబంబునం బ్రభలకరణి ననేక నామరూపచరా

రారాజజహ్నుకన్యా-ప్రవిమలకుసుమ-స్రజ్మనోహారిమాళికా।
క్షీరస్వచ్ఛాంగునర్చిం-చెదముహ్రృదయరా-జీవమధ్యోపవిష్టున్॥

కందగర్భితగీతము.

ధరణీరథశైలకార్ముక।-పరమపురుష।
నాగభూష-పర్వతశర-జా। సురవద।
సదయహృదయమృగ। ధరని-శ్చలగుణగణ।
శశ-ధరసుకిరీటా॥ వృష-స్వామితురగ॥ ౧౨౬॥

మ. మునిహృత్పద్మవిహారహారశరదం-భోదస్ఫురత్కాయకా।
యనదైతేయవిశాలశాలశిఖినే-త్రాస్త్రేత్తుకోదండదం।
డనభీవర్జితభృత్యభృత్యధికరూ-ధస్వాంతరాజీవజీ।
వనదాంచద్గళభాసభాసముదయ-వ్యాప్తాఖిలాశాంతకా॥ ౧౨౭।

సీ. రామేశమేశని-రంతరపూజిత,
జితపురాసురసురా-ర్చితసుచరణ।
రణభయంకరకర-ప్రవిలసత్సారంగ,
రంగద్గవేంద్రతు-రంగరాజ।
రాజశేఖరఖలా-రాతిదోషవిదార,
దారసంత్యక్తశ-రీరభాగ।
భాగమనీరుద్ధ-బహుసూర్యసూర్యజ్ఞ,
దినకరకరటిక్ర్ప-త్తికృతవసన।

గీ. సనకముఖమునిరంజన-జననరహిత।
హితసదాచారచారణ-స్తుతవిహార।
హారదహిపాలపాలనా-యత్తచిత్త।
చిత్తభవభూతివిలసిత-సితనిజాంగ॥ ౧౨౮॥

వ. దేవా ! నీవు నిత్యముక్తుండవు నవిప్రియుండవు నద్వితీయుండ వయ్యును నిజమాయాసమావేశంబున నవ్యాకృతాత్ముండవయితివి యిట్టి నీవలన శబ్దగుణకంబగు నాకాశంబుపుట్టె, నాకాశంబు

వక్షరాక్షరపురుషులకన్న నుత్తమపురుషుండవు అమాయుండవు మాయివి. సగుణుండవగుణుండవు జీవుండవీశ్వరుండవు కారణాత్మకుండవు. కార్యరూపుండవు సులభుండవు. అసులభుండవు. దూరస్థుండవు. నికటవర్తివి ధ్యేయుండవు ధ్యాతవు. స్తవ్యుండవు. స్తోతవు. అవాఙ్మానసగోచరుండవు. వేదాంతప్రతిపాదితంబును, ప్రకృతిలీనంబును నగు పరంబుకన్నఁ బరుండవు. మహేశ్వరుండవు. నీయాజ్ఞవలన నాదిత్యుండుదయించు. పవనుండు సంచరించు. మునీంద్రాగ్నులు ప్రవర్తింతురు. మృత్యువు ఖలునలిడు. నీయాజ్ఞ దిక్క్రుత్రాణంబునుం జలింపదు. నీవు సర్వనియామకుండవు నీమాయాప్రభావంబచింత్యంబనిర్వాచ్యంబు. దురత్యయంబు, నీయందుఁ బ్రపన్నులగువారు నీమాయం గడుతురు. సర్వక్రతుభోక్తవు, సర్వకర్మఫలప్రదాతవు నగు నిన్ను యథార్థంబుగా నెఱుంగంజాలక యన్యదేవోపాస్తిగావించు నకృతాత్ములగు వారలపరిమితస్వర్గాదిభోగంబులనుభవించి పునర్జననఖేదంబునొందుదురిది యెఱింగి భవద్భక్తులు ఫలాకాంక్షులుగాక కర్తృత్వాభిమానంబువిడిచి యజ్ఞదానతపఃకర్మంబులాచరించి భవదారాధనంబు చేసి ముక్తిజెందుదురు. మహాత్ములుకొందఱు పూర్వజన్మకృతసుకృతపరిపాకంబువలన నిర్మలాంతఃకరణులై యాచార్యునుపాసించి శ్రద్ధాళులై యింద్రియమ్ములనిరోధించి తాత్పర్యంబునం బొదలుచు, మహావైరాగ్యంబుశోభిల్ల వివిక్తస్థలంబున సుఖాసీనులై సమకాయశిరోగ్రీవులై నాసాగ్రంబువిలోకింపుచు విరజంబువిశుద్ధంబునగు. హృత్పుండరీకంబున నచింత్యావ్యక్తవిశదామృతాదిమధ్యాంతరహిత విశోకప్రశాంతశివస్వరూపుండవైననిన్ను దీర్ఘకాలనైరంతర్యంబులం జింతించి మహానందహ్రదసమగ్నతం జెంది కృతార్థులగుదురు. ధ్యానంబునం గొందఱు, జ్ఞానంబునం గొందఱు కర్మయోగంబునం గొందఱు, సంకీర్తనస్మరణానంద

చరభూతంబులు నీయందుజన్మించి వెండియు నీయందె యేకీభావంబుఁజెందు. అణువుకంటెఁ నణుతరుండవు మహాత్తుకన్న మహాత్తరుండవు. దూరంబునదె మనపాదుండవు సర్వంబుగ్రహించునపాణివి. శబ్దంబువినుకర్ణుండవు. రూపంబు జూచునచక్షుండవు. సర్వతఃపాణిపాదుండవు సర్వతోక్షిశిరోముఖుండవు సర్వతశ్రుతిమంతుండవు సర్వంబు నావరించియున్నవాఁడవు నిత్యుండవు. సత్యుండవు నిష్కళుండవు నిరంజనుండవు నిర్లిప్తుండవు. నిర్వికారుండవు నిర్వాణరూపివి. నిస్తరంగబోధసముద్రుండవు. సచ్చిదానందఘనుండవు అతులుండవు అజుండవు అనఘుండవు. సర్వభూతాశయస్థితుండవు. గతివి భర్తవు ప్రభుండవు సాక్షివి నివాసంబవు. కర్తవు ఘనుండవు ఉన్నతుండవు. శరణంబవు సుహృత్తవు నిర్హేతుకబంధుండవు దయాపరుండవు. భూతభావనుండవు సర్వవ్యాపివి సర్వారాధ్యుండవు సర్వభూతాంతరాత్మవు. కేవలుండవు నిర్గుణుండవు. షడ్గుణైశ్వర్యసంపన్నుండవు. సనాతనుండవు. యోగిధ్యేయుండవు ద్వితీయవస్తుశూన్యుండవు. ప్రత్యగాత్మవు, శ్రోతవ్యుండవు, ద్రష్టవ్యుండవు, మంతవ్యుండవు, నిదిధ్యాసితవ్యుండవు, ప్రణవగమ్యుండవు, నీతత్వంబు బ్రహ్మాదులెఱుంగరు. సూర్యచంద్రాగ్నిప్రకాశకంబు నీతేజంబు. సమస్తప్రపంచంబు నీస్థూలశరీరంబు. నీనిశ్వాసంబులు వేదంబులు నీవు భూమియం దావేశించి భూతంబులం దాల్తువు. వైశ్వానరుండవై ప్రాణుల దేహంబులాశ్రయించి ప్రాణాపానవాయుసమేతుండవై చతుర్విధాన్నపచనంబు సేతువు. రసాత్మకుండవై సోమరూపంబున నోషధులం బోషింతువు. సూర్యుండవై జగంబులు వెలింగింపుచు ప్రజోత్పాదనారంబు వర్షింతువు. స్మృతిజ్ఞానాపోహనంబులు నీవలనం బొడము. నీవ సకలోపనిషద్వేద్యుండవు వేదాంతకర్తవు. వేదవేత్తవు నీ

నిఖిలోపాధినిషేధం బొనరించి సర్వాధిష్ఠానంబవగు నిన్ను తత్వ
మస్యాది మహావాక్యార్థవేత్తలు సోహంభావనా పరులయి యె
ఱుంగుదురు. గురువేదాంతవిశ్వాసంబులు లేనివానికి నీతత్వంబు
తెలియనలవిగాదు. సర్వప్రకాశకుండగు సూర్యునివిగతచక్షుండు
దర్శింపనేరనివిధంబున నవిద్యామోహితుండు సర్వవ్యాపకుండ
వయిన నిన్నెఱుంగనేరక పుట్టుచుం జచ్చుచునుండు. క్షణమాత్రం
బయిన నీవు తౌనితలంచు సుకృతికృతకృత్యుండగు- కృష్ణపిం
గళుండవు విరూపాక్షుండవు ఊర్ధ్వరేతస్కుండవు- నీలకంఠుం
డవు- ఉమాసహాయుండవు- పరమేశ్వరుండవునయి లోక సంర
క్షణంబుకొఱకు విశుద్ధోర్జితదివ్యమంగళ విగ్రహంబు ధరించి కై
లాసశిఖరంబున విహరింతువు నీవ వటవిటపి మూలభాగంబున
వీరాసనస్థుండవయి యువవేషధరుండవయి పరమగురుండ వయి
వృద్ధులగుశిష్యులకు నిస్సంశయంబుగా బ్రహ్మతత్వంబు మౌనము
ద్రనుపదేశింతువు- హరిహిరణ్యగర్భాది దేవతలచేతంబూజలుగొ
నుచు వారియభీష్టంబులు కృపసేతువు- భక్తులకుభక్తుండవయి వి
నోదింతువు- దిగంబరుండవయ్యు సకలైశ్వర్యశాలివి, ఉగ్రుండ
వయ్యుం బ్రశాంతుండవు, అర్ధనారీశ్వరుండ వయ్యు నిస్సంగుండ
వు, విషధరుండవయ్యు నమృతప్రదుండవు, అద్వితీయుండవయ్యు
ననేకమూర్తివి, అత్యద్భుతప్రభావుండవు, నీతత్వంబునీవెయెఱుం
గుదువు- నీగుణకథనంబుసేయ మేమెంతవారము- జడమతులము,
అజ్ఞులము, విషయాసక్తులము, చపలస్వభావులము. దుస్తరంబగు
సంసారసాగరంబున మునుంగుచుం దేలుచుం దరిగానక బహుక్లే
శంబు లనుభవింపుచున్నారము- మమ్మురక్షింపుము- ప్రసన్నుండ
వగుము- మాదుఃఖంబునివారింపుము- మమ్ముం జేపట్టుము- నీ దాసు
లంగావించి కటాక్షింపుము- మా మొఱలాలకింపుము మావిన్నపం
బుంజిత్తగింపుము. మాకోర్కెలు ఫలింపంజేయుము- మాయుపరా

నపూజన దాస్యంబులం గొందఱు, నిన్నారాధించి నిత్యాభియుక్తులై సిద్ధిపడయుదురు. సమలోష్టాశ్మకాంచనులు, శత్రుమిత్రసములు, నిందాస్తుతితుల్యులు, సంగవివర్జితులు, నిశ్చలచిత్తులు హర్షామర్షభయోద్వేగముక్తులు, యదృచ్ఛాలాభసంతుష్టులు, నిర్మత్సరులునునగు భక్తులు నీకుం బ్రియతములై వెలుంగుదురు. ఫలజలపుష్పపత్త్రమాత్రసమర్పణంబునం దృప్తుండవై దాసులం గృతార్థులం గావించు పరమకృపాసాదరుండవు నీవ యింద్రుండవు, చంద్రుండవు, బ్రహ్మవు, హరివి, శివుండవు, కాలుండవగ్నివి, విరాట్టువు, స్వరాట్టువు, అసురుండవు, మరుదశ్వవసురుద్రాదిత్యప్రజాపతిధనదవరుణాదిమూర్తివి, నీవభూతభవ్యత్ప్రభుండవు, నీవపరమగతివి, నీవు సర్వంబు నెఱుంగుదువు. నిన్నెవ్వరెఱుంగరు. జపాకుసుమాదిసంయోగంబున శుద్ధస్ఫటికంబు నానాత్వంబు భజించుతెఱంగునం బ్రకృతిసాంగత్యంబునం జేసి బహుప్రకారంబులం గానంబడుదువుగాని నీవొక్కరుండవు నీయంద సర్వంబు జనించె. నీయంద నిలిచె నీయందలీనంబగు నీవ సర్వబ్రహ్మంబవు. గగనగతుండగు తపనుండు పెక్కు జలఘటంబులం బెక్కుమూర్తులు వహించి చూడంబడు వడువున నీవొక్కరుండవయ్యు నభోవాతాగ్నిసలిలపృథ్వీదేవనరతిర్యగాది నానోపాధుల ననేకప్రకారంబులం గనుంగొనంబడుదువు. నీవ సర్వక్షేత్రంబుల క్షేత్రజ్ఞసంజ్ఞవూని వసింతువు నీవ షడ్వింశతముండవై ప్రకృతివిలక్షణుండవై ప్రకాశింతువు. ప్రాణాయామపరాయణులగు యోగులకు లభ్యుండవై నాద బిందు కళాతీతుండవయి రాజిల్లుదువు. రజ్జువునందు సర్పంబును, శుక్తియందు రజతంబును, మరుమరీచికయందు జలంబును, మిథ్యాభూతంబై తోఁచు పగిది నీయందు విశ్వంబు భ్రాంతికల్పితంబయి తోఁచుటసత్యంబు గాదు. నేతి నేతీతి వాక్యంబుల

శ్రీరస్తు.

# రామేశ్వరమాహాత్మ్యము.

## పంచమాశ్వాసము.



మద్భారద్వాజము-
హేమునికులతిలక భీమయామాత్ర తనూజా
క్షేమప్రదమల్లేశ్వర-
స్వామిగురుజానపల్లి-సదనవిహారా. ౧॥

వ. అవధరింపుము శౌనకాదిమహర్షులకు సూతుండిట్లనియె. ౨॥

క. శ్రీవిశ్రుత రామేశ్వర-
దేవుని విఖ్యాతకథను-ధీజనులారా-
నేవివరింతు వినుండని,
భావంబున గురుని దలచి-పలుకదొడంగెన్. ౩॥

క. సిరివిరిబోడికి నెళవై-
సురకత కురువిందవజ్ర-మయభవనంబై-
నిరుపమవిభవంబై మణి-
పురమొప్పుం బాండ్యదేశ భూషణము పసన్. ౪॥

క. పరబలభేద్యాత్మజనాయక-
సుంక్షితింబను ముగుదున సుప్రజవిద్యా-

థంబు సహింపుము - నీకు నమస్కారంబు - నీకు నంజలి, నీకు శరణా
ర్థి, నీకు వరివస్య, నీకుఁ బ్రపత్తి, నీకు సమారాధనంబు, నీకు నీరా
జనంబు. ౧౨౯॥

వ. అని సూతుండు చెప్పిన విని శౌనకాదిమహర్షులు తదనంతర కథా
విధం బెట్టిదని యడిగిన- ౧౩౦॥

క. పశ్యల్లలాటదురితా।
వశ్యాయసహస్రకిరణ-వక్షాకాలా।
భవిశ్యామలకంధరద్య।
గ్రలీశ్యపరిజ్ఞానవేద్య-దివ్యాకారా॥ ౧౩౧॥

భుజంగప్రయాతము.

ఫణిస్వామిమంజీర-భాస్వత్పదాబ్జా।
రణత్క్షోణిరథాత్త-రాత్రించరౌఘా।
గణేశాదిశైవాగ్ర-గణ్యాభివంద్యా।
గుణీభూతచక్రాగ్ర-గోత్రేంద్రచాపా॥ ౧౩౨॥

గద్య:—ఇది శ్రీ మదుమామహేశ్వర కరుణాకటాక్ష వీక్షాపాత్ర
యేనుగ లచ్చయామాత్యపౌత్ర తిమ్మనామాత్యపుత్త్ర
వివిధ విద్వజ్జనవిధేయ లక్ష్మణకవినామధేయ ప్రణీ
తంబయిన రామేశ్వరమాహాత్మ్యంబను
మహాప్రబంధంబునందుఁ
జతుర్థాశ్వాసము.

శ్రీ. శ్రీ. శ్రీ.

గీ. దిటముగా నిందుసుడిగట్టు-తియ్యవిటి
కదళినివ్వలనవ్వలఁ-గానొనర్చి
పల్లవతనసేర్పు నెగడంగ-నిలిపెనవఁగ
వీటఁగోటయుఁ బరిఘయు-వినుతిఁ గాంచు ॥ ౮॥

గీ. ఆగులు దిగులొందు తనపుత్రి-యైనరాజు
తమివిమిన్నందిచనఁ బుడ్డు-దాకుననుచు
నెట్టుకొని వార్థి వెసఁ గోట-జుట్టుకొనియె
ననుచు జనులాడుకొనఁ ఖేయ-మమరుఁ బురిని ॥ ౯॥

గీ. పురము నెంతయు నొకశిరం-బున వహించె
జిత్రమని చిల్వ ఱేసిద-ర్పంచుకాంక్ష
నడఁగి పాతాళమున కేగ-నవఁగఁ బురిని
బహుళగంభీర నీరమై-పరిఘ దనరు ॥ ౧౦॥

మ. జలఖేలత్ఫణికన్యకా కుచతటీ-సంఘట్టనోద్భూత చం
చలకల్లోల విధూత హాటక సరో-జ శ్రేణి నిర్యద్రజః
కలితంబై విహరన్మరాళకులరం-గత్కూజితోపేతమై
యలరుం దత్పురియందు ఖేయవలయం-బంభోధిగంభీరమై ॥ ౧౧॥

గీ. అతులకలధౌతరత్న ని-ర్మితము లగుచు
మిన్నొరయుచున్న యవ్వీటి-మేడగములఁ
బద్మినీబాంధవునిఁ గ్రిందు-పరచకున్న
పూనిమిత్రుండనితలంచి-మానెఁగాక ॥ ౧౨॥

చ. అనిశము దత్పురంబునను-హాటకనిర్మిత హర్మ్యసీమలం
దనుపమ కామసంగరభ-రాలసనీలసరోజలోచనా
జనముల సేదదీర్చు సుర-శైవలినీకనకారవిందబృం
దనవపరాగగంధసము-దంచిత మందమరుత్కిశోరముల్ ॥ ౧౩॥

ఉ. కూరిమిఁ గిన్నరుల్ సభలఁ-గూడి వియజ్ఝరతీరకుంజముల్
చేరి యనూనగానములు-సేయఁగ వీణలు మేళవించి తా

మ. అలవీటన్నలరొన్న వైశ్యులు యిలా-భాపేక్షద్వీపాంతరం।
బులకుంబోయి సువస్తురత్ననికరం-బుల్ నావలం దెచ్చుచోఁ।
జెలువొప్ప న్వెలిదీవికే గిరానిల-క్ష్మిం దెచ్చుటం జేసి వా।
రలాయిండ్లం గమలావధూటి తిరమై-రాజిల్లు నెల్లప్పుడున్॥ ౨౦॥

ఉ. శ్రీయువతీ ప్రియాంఘ్రిసర-సీజభవుల్ జనరక్షణక్షమా।
పాయవిచక్షణుల్ భువన-పావనదేవనదీ సహోదరుల్।
న్యాయపథప్రవర్తనుల-నారతభూసురపాదభక్తిశో।
భాయుతు లుగ్రసత్త్వబల-భద్రులు శూద్రులు బొల్తు రప్పురిన్॥ ౨౧॥

క. నుడివడ బెడిదపు పిడుగుల।
నడరుచుఁ బెడచేత నడఁతు-రలమృధుఁ బుడమిం।
బడవైచిన కవ్వడి వడి।
కడ జడనని నగు దురందుఁ-గలవీరభటుల్॥ ౨౨॥

మ. కరమొప్పం బురిపద్మలోచనలు శం-ఖగ్రీవికల్ కుందబృం।
దరదల్ నీలకచావళుల్ మకరప-త్రశ్రీజిగండస్థలుల్।
వరమాలూరకుచల్ ముకుందపదభా-స్వన్మధ్యమల్ దివ్యభా।
స్వరశృంగారనిధుల్ దనర్తు రచట-న్వారాంగనారత్నముల్॥ ౨౩॥

చ. మరుని మదంపుటేనుఁగులు-మారుని పెంపుడిలేండ్లు శంబరా।
సురరిపు కేళికీరములు-సూనకదంబుఁ దుబోరిది సేయుబం।
గరుసును బువ్వుదీవలు జ-గన్నుత యానకటాక్షమాధురీ।
పరిచితభాషణాంగరుచి-భాసినులప్పురిలో విలాసినుల్॥ ౨౪॥

చ. అరయఁగ వారదభ్రమక-రాలకలైశుకమోహనోక్తిబం।
ధురత దనర్చు పర్వతమ-నోహరతుంగకుచావనమ్రలై।
పరగిన వేశ్యలందు సిరి-బర్వి యతిస్ప్రహణీయమూర్తులై।
కరము వసుంధర న్వినుతిఁ-గాంచుట చిత్రమె యొంచిచూచినన్॥

సీ. వనిత నీదండకై-వలసివచ్చినవాఁడ,
విలువెంత చెప్పిన-వేగనిత్తు।

చ. అలపుర రాజబృందముల-కప్పు వమానుఁడమిత్రవృత్తులై
బలసినవారివాహములఁ-బాయఁగఁ ద్రోలఁగ నేర్చె నాతఁడు
వ్యాలజవవిద్య నేర్చెఁ బ్రసక్తని సంతతమభ్యసింపుచున్
బలిమిఁ జరించ నాతనికి-భవ్యసదాగతిసంజ్ఞ వర్తిలున్ ౩౧

మ. హరిణోత్కృష్టగతిప్రభన్ వెలసి రా-జాంచజ్జయశ్రీపదా
స్ఫురదాత్రేయసులక్షణంబులు బుధ-స్తోమంబులగ్గించి చూ
పరహిన్ సింధువునందు దేవమణితో-పంబుట్టియుచ్చైశ్శ్రవ
స్తురగశ్రేష్ఠముకన్నఁ బెద్దలవలెన్-శోభిల్లుఁ బౌరాశ్వముల్ ౩౨

ఉ. ఏదెసఁ జూచినన్ గజము-లే దెసఁ జూచిన వాజిమండలం
బే దెసఁ జూచినన్ రథము-లే దెసఁ జూచిన సైనికవ్రజం
బే దెసఁ జూచినన్ రుచిర-హేమధరాధర సార్వభౌమ దా
యాదములట్లు శోభిలు మ-హోర్వహిరణ్మయరాసులప్పురిన్ ౩౩

చ. చలువలు గట్టు హారములు-చక్కఁగ నైచి మెఱుంగు మేనులం
గలపముఁ బూసి వాసనలు-గ్రమ్మ సుమాల్యవరించి కస్తురిం
దిలకము దిద్ది యొద్దికల-నెచ్చెలులం జతగూడి వేడ్కఁ వే
శ్యలసొగసుల్ గణింపుచు న-యంబు విటుల్ విహరింతురప్పురిన్ ౩౪

చ. మలయసమీరుఁడన్న గరి-మాపటివేళ విలాసదీర్ఘికా
జలముల నీదులాడి పిక-సన్నవపుష్పలతాంగనాళికిన్
మెలకువ నబ్బువల్ గఱపి-మేలుగ వచ్చి శ్రమంబుఁ దీర్చెఁ గాఁ
బలుమరు నివ్వటిల్లు నల-పౌరులకున్ సురతప్రసంగముల్ ౩౫

వ. మఱియు నప్పురంబు కప్పురంబువోలె సదామోదజనకంబై, యు-
ద్యానంబువోలె సుమనోమనోహరంబై, త్రిదివంబుఁబోలె సౌధో
త్కృష్టవిశ్రుతంబై, కాసారంబువోలెఁ బద్మాకరంబై, రఘువంశంబు
వోలె రామాలంకృతంబయి, సముద్రంబువోలె వాహినీసంకులం
బయి, నృపసైన్యంబువోలె బహుళధార్మికంబై, రామాయణంబు
వోలె శోభనకాండంబయి, మహాప్రసాదంబువోలె బహువసుసం

నిచ్చను విరిబంతు-లిచ్చి మన్నింపుమీ,
ననవద్దునాకునో-వనజగంధి।
మగువరో కొసరక-మానము న్మెసర,
యతను సౌఖ్యవినోద-మాచరింతు।
పదలక నేగొన-వచ్చినప్పుడు నీవి,
విడిపోకయుందు నే-విద్రుమోష్ఠి!

గీ. యనుచుఁ దమతోడ నెరజాణ-తనము మీఱ।
జాణ శేఖరులాడెడు-సరసవర్త।
వచనరచనలకలరి భా-వజునితూఁపు।
లమ్ముదురు పుష్పలావిక-లప్పురమున॥ ౨౬॥

గీ. స్తబకములఁబోల్చి విస్ఫార-స్తనులఁ బొసఁగి।
భ్రమరవిలసితవృత్తసం-పదలఁ బొదలి।
యతులమృదుకలికామంజు-లతలఁ దనరి।
చాటుకృతులట్లు పీటఁ బూఁ-దోటలమరు॥ ౨౭॥

గీ. వీటనీటగు మిన్నఁ బూఁ-దోటలందుఁ।
గ్రొవ్విరులతావి మిన్నంది-కొనఁగనందుఁ।
దియగు తెరగంటి యన్నలే-తెంచి కాంచి।
భళిభళీ యనోవ్వుచు-నిలుతురెప్డు॥ ౨౮॥

మ. కరిము న్నొక్కటి పూజసేయుఁగ నుమా-కాంతుండు దా మెచ్చి తా।
త్వరతం దానును మెప్పుఁగాంతు మనిశం-భద్వారకుంభీంద్రముల్।
హరుమూర్త్యంతరమట్లుఁ దాఁ బెడఁగి పూ-జార్థంబు హర్షంబునం।
గరముల్ సాచి పెకల్చు నిర్ఝరసరి-త్కాంజాతపుంజంబులన్॥ ౨౯॥

మ. నలువొప్పన్ ద్విజరాజు గావునన దా-నందియ్యనోషట్పదీ।
కలితాకాశతరంగిణీజలజశం-కం బట్టి యయ్యంగనో।
విలసత్పట్టణగంధసింధురపతు-ల్వేమారు సేనాంకమం।
డలపర్యంతము జాచు హస్తములు క్రీ-డాలంపటత్వంబునన్॥ ౩౦॥

సీ. రాజమౌళియనంగఁ-బ్రఖ్యాతిచేమించి,
జితకాముఁడనఁగఁ బ్ర-సిద్ధిఁజెంది।
సర్వజ్ఞుఁడితఁడనఁ-జాలగౌరవమంది,
సంతతంబునుశివా-శ్రయతఁదనరి।
అహితపురచ్ఛేద-నాసక్తివిలసిల్లి,
భూతదయాఢ్యుఁడై పొగడుగాంచి।
అక్షయతూణీరుఁ-డైయాజిజయమొంది,
లోకపాలశ్రేణి-లోనహెచ్చి।

గీ. సామజాంతకవిక్రమ-శాలియగుచు।
భూతినలరారునమ్మహో-పుణ్యమూర్తి।
శంకరాహ్వయుఁడగుట కా-శ్చర్యమేల।
నతనిఁదలఁచినఁబ్రజకుసౌ-ఖ్యంబుగలుగు॥ ౭౯

క. కురధుఁడువిషమేక్షణుఁడు।
ధ్వరహరుఁడుగ్రుండుగాని-ధన్యుండౌశం।
కరుఁడైశ్వర్యముశోభిలఁ।
బరగెన్ భువివెలితిలేని-పౌరుషమహిమన్॥ ౮౦

ఉ. మానుగఁదివ్యవిల్లువిరి-మచ్చికనారియుఁజావితూఁపులుం।
బూనినవాఁడశంఁడుమఱి-పూనినవాఁడితఁడింతమాత్రమే।
కానిమరుద్దియుంగొఱఁత-గాదుమనోభవశంకరక్షమా।
జానులకున్ జగత్త్రితయ-సన్నుతరూపవిలాససంపదన్॥ ౮౧

చ. ఇలపయిశంకరక్షితిత-లేంద్రుఁడుకల్పతరుత్రపాకరో।
జ్జ్వలదురుదానశీలతన-జస్రముశోభిలుచుండఁబైఁడిగు।
బ్బలివెరచున్ ధనార్థులకుఁ బంచియిడుందనునంచుదేవతా।
నిలయముగానమానునని-నిర్భయవృత్తివహించువెండియున్॥ ౮౨

ఉ. వేమరుఁబుణ్యకాలముల-వేడుకశంకరరాజుప్రాజ్ఞుఁడై।
హేమమయాంబరంబులును-హేమముగూరించిమహీసుపర్వుకు।

పూర్ణంబయి, భారతంబువోలె సుశ్లోకంబయి, కుబేరదిగ్భాగంబువోలె సార్వభౌమనివాసంబయి, శంకరశరీరంబువోలె సర్వమంగళాధారంబయి, ద్వారకాపురంబువోలె నచ్యుతాగ్రజ సత్త్వకలితంబయి, వైకుంఠంబువోలెఁ బురుషోత్తమశోభితంబయి, శరత్కాలంబువోలెఁ బ్రసన్నరాజరుచిరంబయి, సువర్ణశైలంబువోలె లోకాద్యుషితంబయి, అంతరిక్షంబువోలెననంతరత్నప్రభాంచితంబయి, సత్కావ్యంబువోలె నలంకారప్రచురంబయి, పూర్ణిమాచంద్రమండలంబువోలెఁ గళానిధియయి, యొప్పు నప్పట్టణంబునకధీశ్వరుండు. 3౬॥

సీ. తనమహావిమలచి-త్తముపార్వతీమనో,
హరునకుఁ గేళిమం-దిరము గాఁగఁ।
దనభర్తమార్గవ-ర్తనచరిత్రము క్షత్ర,
జాతికమూల్యభూ-షణము గాఁగఁ।
దనఘనాద్భుతనిరం-తరదానవిభవంబు,
కల్పభూజాదుల-గణనమాన్పఁ।
దనని తాంతసమృద్ధ-ధనవిజృంభితమైన,
సిరికుబేరునకైన-సిగ్గొనర్పఁ।
గీ. దనయశంబుదిగంతదం-తావళీంద్ర।
దంతకాంతులకధికసాం-ద్రతఘటింప।
నమరునిత్యప్రతాపని-రస్తకోటి।
తరణివిభుఁడైనశంకర-ధరణివిభుఁడు॥ 3౭॥

మ. దిగిభశ్రేణిదశావశత్వమునవ-ర్తించె న్మహాశేషప।
న్నగుఁడిచ్చందిరిగంగులాద్రులలమై-నాకుంగనంబోయెనో।
పృగశ్రీదేవిఁగాఁగిలించెఁగుహనా-హో త్రీశ్వరుండాదటన్।
జగతీభారముశంకరుండురుభుజా-స్తంభంబునం దాల్చుటన్॥ 3౮॥

క. ఈవస్తువిపుడుతనకుం।
గావలెనిమ్మనుచునొరయనిం-గని వేఁడెడువాఁ।
డేనంక లేఁడు శంకర।
భూవరు రాజ్యమునఁ బ్రజలు-బొరసిరిఁగ వుటన్॥ ౫౦॥

గీ. అన్నపాలుఁడు గావించు నధ్వరముల।
నిజమహావిర్భాగభోగసం-తృప్తులగుచు।
మనుగడుపు పెండ్లికొడుకుల-మాడ్కిఁ బుష్టి।
గాత్రులై రింద్రుఁడాదిగాఁ-గలుగు సురలు॥ ౫౧॥

క. దనుజులహరివలె శాత్రవ।
మనుజేంద్రుల గెలిచి విజయ-మహనీయుండై।
ఘనభూచక్రము దాల్చెను।
తనసిరి బుధనుతముగాన-తంపతులన్నృపతిన్॥ ౫౨॥

క. కావలసినయప్పుడయా।
భూవరపుణ్యమున రాష్ట్ర-ములఁ బర్జన్యుం।
డావిర్భవమొందిసుభి।
క్షావహముగ వానఁ గురియు-సంచితవృత్తిన్॥ ౫౩॥

క. నగరంబులు రాష్ట్రంబులు।
నగణితధనధాన్యయుతము-లై యభయములై।
సెగడఁగఁ బ్రముదితమానసు।
లగు మనుజుల్ దన్ను బొగడ-నానృపుఁడేలెన్॥ ౫౪॥

వ. మఱియు నప్పుడమిఱేఁడు మూఁడుగన్నుల వేల్పుం బోరితోడం గూడిపోరాడి యోడించి మించిన క్రీడియుం దమకునిడు గాదని వాడిమెఱసి పలుకు విలుకాండ్రు దన్ను గెలువ బలువడిం బరిఢవిల్లి యెల్లకడలు గెలిచి కొలిచి నిలిచిన రాచపట్టిం జేపట్టి మట్టుపఱచి పెట్టి దంబగు కినుకం గసుపట్టియని మొఱయించిన రినిందునిమ యొశుద కడలుగడలుకొను నెలుంగుల బలుకంబంబుల గెలుపువ్రాలు వ్రా

త్రాములకిచ్చుచుండఁగను-దంచితవస్త్రసమృద్ధశాలియై।
కామవిరోధిమాన్యుఁజిర-కాలికనైజభంగఁబరత్వమున్॥ ౪౩॥

చ. అనిమొనవైరిరాజులుభ-యానకభూరితరానకధ్వనుల్।
వినిపఱవెత్తిరెత్తినటు వీపథకంటకకుంఠితాంఘ్రులై।
పనిచెడిఖిన్నులైపతిగ-భావముభావమునందుఁగోరుచున్।
వనరుహసంభవుంబసుప-వాకృలనిందయొనర్తురెంతయున్॥ ౪౪॥

సీ. అనృతవాదియుఁబాపచిం-తావిలుండుఁ।
బరధనాపేక్షియును నెవ్వఁ-బడినవాఁడు।
రోగియును నెందు లేఁడొక-రుఁడుదలంప।
శంకరుండేలునఖిలరా-జ్యంబునందు॥ ౪౫॥

గీ. గోవులెల్లప్పుడును బాలు-గురియుచుండుఁ।
బుష్పఫలసంపదలనొప్పు-భూరుహములు।
బహుళసస్యంబుముకాఁపు-గాంచుచుండు!
సతఁడుబాలింపధాత్రిబు-జ్యంబుకలిమి॥ ౪౬॥

క. పానీయశాలికలును।
ద్యానంబులుసలిలపూరి-తములగువెనువుల్।
నానామణిమయదేవ।
పానములొప్పునునిలిపె ధరఁదగునెపలన్॥ ౪౭॥

చ. ఫలఘృతశాకపంచవిధ-భక్ష్యసశర్కరపాయసాంచితో।
జ్వలకలమాన్నదానమయ-సత్రసహస్రములెల్లచోటుల।
న్వెలనుదలిర్పనిల్పిహిమ-వన్మలయాచలమధ్యతీరముల్।
లలిభజియింపసేసుద్విజు-లందనుపున్న్యపశంకయండొగిన్॥ ౪౮॥

మ. చతురంభోధిపరీతభూతలపతు-ల్సమ్యక్ప్రకారంబునన్।
నుతిభద్రేభతురంగహేమమణిసం-దోహంబులర్పించియా।
నతులైకొల్వఁగనేకహేళినివహా-నందంబుతోశంకర।
క్షితిపాలుండుధరిత్రియేలెవిలస-త్కీర్తింబ్రతాపోన్నతిన్॥ ౪౯॥

గీ. జైత్రయాత్రోద్యతానంగ-సార్వభౌము।
సచివకృతరక్తరాంకవ-చటులపటకు।
టీరములనంగ వనులనిం-పారెబాల।
పల్లవాంచితభూరుహ-ప్రతతులపుడు॥ ౫౭॥

క. అవనీచ్యుతపత్రములై।
నవపల్లవలక్ష్మిఁ జేఁగ-నందగెమహీరు।
ణ్ణివహములు లేమిదొలఁగిన।
భువిలోసిరిచేత వెలయు-పురుషులకరణిన్॥ ౫౮॥

క. శుకచంచూపుటనిభకిం।
శుకముకుళవ్రజములపుడు-చూడఁగనొప్పెన్।
మకరధ్వజతేజోగ్ని।
ప్రకటప్రభలచటనచటఁ-బర్వెవనంగన్॥ ౫౯॥

గీ. కలితదక్షిణదిగ్వధూ-గర్భమునజ।
నించినసమీరశిశువుమ-న్నించిలతలు।
చిగురుటుయ్యెలనుంచిపో-షింపఁబెరిగె।
భీతివిరహులకాత్మలోఁ-బెరుగుచుండ॥ ౬౦॥

సీ. సహకారమంజరీ-సౌరభ్యవిభవంబు,
మాధవీమంటప-మండితంబు।
వ్యాకోచకేసర-వాసనానిలయంబు,
మల్లికాస్ఫుటదినాం-తోల్లసితము।
మలయమారుతపోత-మానితభువనంబు,
స్మరశరోల్లేహన-సాధనంబు।
డోలికాకేలీవి-లోలబాలారత్న,
మఖిలర్తుగణమస్త-కాభరణము।
గీ. కేళివనవాపికాతీర-ఖేలనార్హ।
మంజుకుంజగృహాంతర-మదనకదన।

యుంచి జింక నెక్కు నెక్కటిశో మిక్కుటంబుగా నెకసక్కెం
బులాడుపడిగలమేలుజక్కి పౌజులడెక్కలతెరవున క్రమ్మిముమ్మ
రంబుగా నెగయు నెలదుమ్ముకడలుంజడి యడుసుకొటుపదాడియా
డిపుడమిచేడియకుఁదానయొడయండై యడిగెడువారికోరికకెక్కు
డుగావిడెముడెయిడుచుంగడుంబొడవగుపొగడుఁగాంచి పుడుకు
దోడుకుందెగడి నెగడికడలిరాయనినడుగుపరచి బుడుత నెలదారిం
గేరి పెట్టుచెట్టుచట్టులరట్టుపాలుజేసి వాసింబేర్చి నేర్చినవాఁడై
జన్నంబులెన్నియునోనర్చి వెన్నుండుమొదలగు జన్నంపుతిండి
పిండులకుఁబండుగ సేయుచు నక్కజంబగు చక్కదనంబునంజూ
క్కుల తేనికిం జక్కెరవిలుకానికి నెక్కువయైపక్కిజక్కిరాహుత్తు
పెక్కురక్కసులం జక్కాడుకరణి వెక్కసపుటక్కరులనుక్కు
డంచిసజలయెడ నిక్కువంపుమక్కువనెరపుచు మిక్కిలివన్నెకె
క్కుమకుంటె మెడకుందొడవగు పడగదారివడువునుడువవలం
తియై తనయానపూని కానినడకలుమాని మానికంబులు కానుకలొ
సంగిదొరలందరు శరణనిమ్రొక్కుచుం గొలువ విలువలేనికలిమి
యుంబలిమియు నెలకొని తనయందునింపొందచందమామచందం
బున నందతికివిందై యొందునుంగొంతలేక చెందొవవిందుతాల్ప
రియడుగుకెందమ్మిదోయి డెందంబునంబొందుపరచిహత్తుకొన్నబ
త్తింబుత్తడివిరులగుత్తులుం దామరపువ్వుమొత్తంబులిడికొల్చుచు
నెత్తమ్మివిడిదిపడంతుకం దన నెడందరొమ్మున నిమ్ముగానిడుకొన్న
క్రొన్ననవిలుకానితండ్రియుంబోలె సిరులనిరవొందుచు నొయ్య
వనయ్యెకిమీఁదు జగంబేలుచుండెనంత. ౫౫॥

ఉ. కోకిలపంచమస్వరవి-ఘూర్ణితకర్ణవధూవియోగిహృ।
ద్భీకరపుష్పగుచ్ఛమధు-బిందుఝరీవిచరన్మధువ్రతా।
స్తోకసుఝంక్రియానినద-శోభితసర్వజనత్సవప్రద।
శ్రీకలితంబువొల్చె వన-సీమలయందు వసంతమెంతయున్ ॥ ౫౬॥

సురలతాగృహముల-విరులతావులపాను,
పులుఁగుఁబతులతోఁ గలసియతుల
రతులడస్సినమద-వతులచక్కనిచెక్కు,
లనుగ్రమ్ముచెమటలింపునహరించు.

గీ. కమ్మనిసుదుమ్ములరజమ్ము-గ్రుమ్మరించి
నలపుమొలపించిచలువయు-మొలవఁజేసి
యలయికలణంచిమెల్లన-మెలఁగిచెలఁగి
తెమ్మెరలుమధువేళవ-నమ్ములందు॥ ౨౫॥

వ. ఇవ్విధంబున మవ్వంబైనివ్వటిల్లు నవ్వసంతసమయంబున నవ్వసుమతీశ్వరుండొక్కనాడుమంజుల సాలభంజికాశుంభత్స్వరకతస్తంభసంభారంబును నత్యుత్తమచంద్రకాంతభిత్తివిరాజమానంబును వజ్రకీలితలాలితద్వారచారుతరంబును నభినవస్ఫటికరత్ననిర్మితసోపానశ్రేణీరమణీయంబును పురుహూతనీలనిర్మితవాతాయనస్ఫీతంబును పద్మరాగమణికుట్టిమంబును మృదులభాసుర కాస్తభాస్తరణసమంచితంబును నృపోపాయనద్విరదమదజలపంకిలాంగణంబును అసాధారణసౌభాగ్యసాకల్యకళ్యాణంబును విచిత్రవిభవశేషవిలసితంబునునగు సభాభవంబున నవరత్నమయసింహాసనంబున నాసీనుండై కాంతకాంతాకరకతులస్ఫురత్స్వర్ణదండమండితచారుచామరమరుద్వీజ్యమానుండగుచు వైదికమీమాంసకశాబ్దికనైయాయికవైశేషికాలంకారికజ్యోతిషకపౌరాణికసుకవీశ్వరమంత్రిసామంతపురోహితగాయకవిదూషకవైణికవాంశికవారటీక వందిమాగధవైతాళికనర్తకసైనికవ్యావహారికవారాంగనాదిజనులు యథాస్థానంబులనుండి యుచితగతులం గొలువఁ గొలువుకుంజెలువదొంకైంబలుకసలవిగాని చెలువంబునంగొలువుకలుచరాయని పాడుపుతరింబోలుపగు చెంగల్వకొలనువోలె నందుఁజూని కన్నులపండువయై సొంపుసంపాదింప వేడంబులు చ

పరవశాక్షీణసుఖవధూ-వరవిహార।
కాంతమగుచువసంతంబు-ఘనతఁజూపె॥ ౭౧॥

గీ. సామవేదంబుఁజదువుచు-సాధువృత్తి।
మాధవస్తుతిఁగావించు-మానులేమొ।
పికములటుగానికోవ-ప్రియములనుచు।
సద్ద్విజఖ్యాతిచే నెల్లు-సంచరించు॥ ౭౨॥

చ. ప్రమదమునంబికాంగనలు-పాటలువాడమరుల్లసల్లతా।
ప్రమదలుహాస్యముల్సలుప-భవ్యవనీవనితావివాహసం।
భ్రమసమయంబునందలరి-మాధవుఁడోయనమాధవుండుశ్రీ।
విమెరయుసత్ఫలంబులను-విప్రకరంబులకిచ్చెహెచ్చుగన్॥ ౭౩॥

సీ. పృథులపల్లవితపు-ష్పితఫలితోర్వీజ,
రాజరాజితవన-భ్రాజితంబు।
ప్రసవాసవానూన-పానమాద్యద్భృంగ,
సంఘఝుంఝుక్రియా-సంక్రమంబు।
సహకారభూరుహాం-చలఫలాస్వాదనా,
పేక్షాతిశయచలత్పక్షికులము।
ఘనసమ్మదాకులకలకంఠకులకంఠ,
కాకలికలకలో-త్కరితంబు।

గీ. కుసుమమంజులపంజుల-కుంజపుంజ,
మదనకదనపరిశ్రాంత-మతవతిలక।
ఫాలభవనారకణహార-బాలపవన।
మనుమసంపాందెఁజైత్రస-మాగమంబు॥ ౭౪॥

సీ. తతములైవిభ్రమాం-చితములైమఘసాన,
మదమునమిక్కిలి-బొదలిరొదలు।
గమురనింపులునింపు-కోపముతుమ్మెదలచేఁ,
దనరుచుఘనరుచు-లౌనడగొరల।

ద్దెసఁ బ్రొద్దువోడుచు - బెఱుఁగక।
యొసపరిగీములసుకించి - యుంటిమి సామీ॥ ౧౯॥

క. నీ ఖేలిక లెంకలమై।
కావలసిన పనులు సేయఁ - గాఁజాలుదుమో।
దేవా నీయడుగులు గనఁ।
గా వేడుక వొడమి వచ్చి - కంటిమి నెమ్మిన్॥ ౨౦॥

క. మా సత్తువ మావడిమా।
చే సూటియు మాకడిండి - సిరి పేటకు వి।
చ్చేసి కనుంగొని వన్నెయు।
వాసియు మాకబ్బఁ జేయ - వలదే నీకున్॥ ౨౧॥

క. కానల మెకాలు కన్నులఁ।
గాన వృకడుఁ బోతరించి - కావరమునఁగా।
లూనపు రంకెలు వేయుచు।
మానుగఁ బోదలీగుఁ బంటు - మానులు చెలుపున్॥ ౨౨॥

క. కడువాఁడికోరలారపులఁ।
బొడమైదిట్టంపుటిసుక - పోలిక రాలన్।
గడుసుపడి యొకటొకటితో।
బడిబడి పోరాడుఁ గ్రొవ్వి - పందులు కినుకన్॥ ౨౩॥

క. ఎల్లెడఁ జూచిన తాసై।
పెల్లుగ నత్తాడుమన్ను - బిల్లులు డొంకల్।
కేళ్ళు ముడుచు రొవ సేయుచుఁ।
ద్రుళ్ళుచుఁ ద్రెళ్ళుచును లేచి - దుముకుచు నచటన్॥ ౨౪॥

ఆ. మబ్బురోదలకంటె - నిబ్బడిగొనుచునా।
గుబ్బతిల్లనరిది - బొబ్బలిడుచు।
సింగములు చెలంగి - చంగునను రికియే।
నుంగు మొత్తముల - నణంగిద్రుంచు॥ ౨౫॥

ర్చింపుచు శాస్త్రవాదంబులుపరీక్షింపుచు పురాణేతిహాసకథలి
చ్చగింపుచు చంపూనాటకోదాహరణాది చాటుప్రబంధంబులా
లోచింపుచు సంగీతమాధుర్యరసప్రవాహంబులం దేలుచు నృత్యగీ
తప్రకారంబులు విలోకించి మెచ్చుచు ప్రణతనరపాలులంగృపా
శీతలకటాక్షవీక్షణంబులంజూచుచు సకలవిద్యాప్రసంగ గోష్ఠివి
నోదంబుల నుల్లసిల్లుచు శంకరమహీవల్లభశేఖరుండు పేరోలగం
బున్నసమయంబున॥ ౬౬।

సీ. శార్దూలనఖములు-చమరవాలంబులు,
గోరోచనంబును-జారపప్పు।
సెలవిండ్లుపీలిపు-వ్వులఝల్లులును జున్ను,
జవ్వాదిపిల్లులు-శారికలును।
కస్తూరిమృగములు-కరటిదంతములును,
నెరవైన డేగలు-నెమ్మిపురులు।
వేణుముక్తాఫలశ్రేణులు పునుఁగును,
కలితకాలాగరు-ఖండతతులు।

గీ. మఱియునరపులుగలుగుస-మస్తశస్త
వస్తువులు కాన్కలిచ్చియ-వ్వసుమతీశ।
సింహునొయ్యనఁబొడగాంచి-చెంచుదొరలు।
ముదముగదురంగనటసాగి-మ్రొక్కిరపుడు॥ ౬౭॥

ఆ. మ్రొక్కలేచికేలు-మోడ్చునెన్నొసలను।
టించిపలికిరిట్లు-చెంచుదొరలు।
సామిచిత్తగించు-చక్కగామా సేయు।
విన్నపంబుతప్పు-లెన్నకీవు॥ ౬౮॥

క. విసుగులుమేమునునీదయ।
ససిబొప్పడునడవిఁగడుపు-చల్లగదలకే।

బలుసుపొకులు వాగురుల్ మిడి-బద్దలిఁ బెలుఁదీములం।
బులపొదుల్ తడవిఖ్య నారస-ముల్ సుడెల్గాని వేటకాం।
ద్రెలమిఁ గొల్వఁగవస్త్రభూమిత-లేంద్రుఁడున్న తిమిరాజుఁగన్ ॥౨౯

మ. అవనీశుండనుయాయిసైనిక సువీ-రాలాపవార్తాశ్రుతి।
శ్రవణుండై చని కాంచె ముర్తనవద-ద్భల్లూకవ్యాళోగ్రశ।
ల్యవరాహద్విపఖడ్గసింహశరభ-వ్యాఘ్రాదినానామృగో।
గ్రవిహారాకులభీకరంబగు మహా-రణ్యంబు దోదవ్వులన్।  ౩౦॥

వ. వెండియు మందారమాకందమాలూరమాతులుంగమధూకమాధవీ మాలతీమల్లికాసాలతమాలకృతమాలభూర్జరఖర్జూరసర్జకార్జున హరీతకీక్రముకామలక మాగధసింధువారబదరీకాకేసరకురువకకురంటకాదిపాదపవిట పాగ్రనిరర్గళవిహరమాణకీరశారికాకోకిల పారావతప్రముఖనిఖిలశకునినికరనినాదపూరితంబును పథికజన శ్రవణరంధ్రనీరంధ్రమహోత్సవసంపాదన చతురసదాగతిపూరిత కీచకధ్వానసంగతనిర్ఝరిణీసంజనితకమల ఖేలదోలంబగానమృదుల నిస్వనభాసురంబును సహస్రకిరణ పరంపరాదురవగాహంబును నగు నరణ్యంబుదరిసి మృగంబులుసంచరించితావుల రసిములు తారువేయించి పొంగువారించివలలుబరపించి తెరలెత్తించి బోనులొడ్డించి దీములుఘటించి తెరవులరికట్టించి వాకలువంపించి మచ్చుమందులుచల్లించి వాకట్టుకట్టించి॥ ౩౧॥

శా. శాపంబెక్కిడియుగ్రలోపముభుజా-సారంబెలర్పన్ మహా।
కోపారద్వసిధిక్కరించుగుణని-ర్ఘోషంబుగావించియా।
టోపంబొప్ప మృగంబులుర్విఁబడనై ష్ఠుర్యంబుగా నేసెనా।
భూపాలేంద్రుడు చండకాండచయముల్-పుంఖానుపుంఖంబుగాన్

క. నరపతియీగతివిఝ్ఝర।
శరములుబరపుటయునచల-సాధ్వసపరతన్।
గిరికరికేసరికాసర।

వ. అనిమిషయు నన్యవన్యమృగమదోద్రిక్తవ్యాపారంబు లుగ్గడించి అడవులంబడనైయున్న దిప్పుడు వేటకువిచ్చేయందగు నని చెంచులు విన్నవించిన నాకర్ణించి దుష్టమృగనిగ్రహంబు కర్తవ్యంబని సమ్మ యించి శంకరమహీపాలుండు ధనురస్త్రశస్త్రప్రవీణులగు మృ గయుల వేటకురమ్మని చాటంబంచి యారాత్రిగడపి ప్రభాతంబు నం గాలోచితకరణీయంబులు నిర్వర్తించి రక్తోష్ణీష పరిబద్ధుండు ను దృఢగోధాంగుళిత్రాణుండును మహాకోదండపాణియు కచ్ఛా బద్ధమండలాగ్రుండును మృగయావిహారసముచితవేషధారియు పాదుకాగూఢచరణకమలుండును సన్నద్ధుండునై॥

ఉ. మానసమైనతేయపవ-మానసమానసముజ్జ్వలద్రయు।
శ్రీనిలయంబు శారదశ-శిప్రతిభాదవిభాంచితంబునా।
మానితవాజి నెక్కి రిపు-మర్దనుఁ డాతృపమాళివిక్రము।
నూనమహోపదాతిమృగ-యుల్ దనుగొల్వఁగ నేగె వేటకున్॥ ౨౨॥

సీ. వెంటమాణిక్యంబు-విశ్వాసిజంపెడు,
పాలసంద్రంబుతు-పాకిగుండు।
భైరవి జోళంగి-బలుబంతిజవ్వాది,
వియ్యాలదాడివి వేకజోగి।
యురిగోలవలిచీను-గరుడపైఁడిసలాక,
భూతనాథుఁడుకూన-బొడ్డుకంటి।
నీలమేఘము పైఁడి-నిగ్గుజేవురుగొండ,
రాముబాణంబువా-రణముసురటి।

గీ. పుణ్యతీర్థము చేమంతి-పోతురాజు।
సాళువము నాగ బేర్వడ్డ-జాగిలములు।
సరభణులఁ బట్టికొని తెచ్చు-సాగినడచి।
రవనిపతిమ్రోలమృగయుల-యవసరమున॥ ౨౩॥

తరళ. వలలుబోనులుచిక్కముల్ పెను-వాతికత్తులు బల్లెముల్।

మ్మృగంబులనన్వేషించుచుగిరిశిఖర నిర్గతనిర్ఝరిణీసంజనిత కంజాతపుంజమంజులపరాగభరిత సౌరభ్యధురంధరగంధవాహకిశోరప్రసారమహితభారనిరస్తాయాసుండగుచుఁ జనిచనియొక్క విపినోద్దేశంబున॥ ౮౮॥

గీ. గిరిగుహామధ్యవాసునిఁ-బరమశాంతు।
వ్యాఘ్రచర్మావృతాంగుద-యాంతరంగు।
మౌనినొక్కనివ్యాఘ్రమన్-మతినిఁదునిమె।
మనుజనాయకుఁడొకతీవ్ర-మార్గణమున॥ ౮౯॥

గీ. శంకరన్నపప్రయుక్తమా-సాయకంబు।
శీఘ్రగతితోడవచ్చియా-చెంతనున్న।
యమ్మునీంద్రునిపత్నిమ-హాపతివ్ర।
తాశిరోమణిదెగటార్చి-దైవగతిని॥ ౯౦॥

వ. ఇట్లు శంకరన్నపాలప్రయుక్తబాణనిహతులైన జననీజనకులఁజూచి తత్సుతుండు జాంగలుండనువాఁడప్పుడు భృశదుఃఖితుండగుచు నెలుంగెత్తిరోదనంబుసేయుచు నిట్లనివిలపించె॥ ౯౧॥

సీ. ఓతాతయోమాత-యోదయాంబుధులార,
యిటునన్నువిడిచిమీ-రెచటికిప్ప।
డేగితిరెచ్చోటి-కేగుదునేను నా,
కెవ్వాఁడురక్షకుఁ-డెన్నిచూడఁ।
జదివించునన్నుబాలిఁ-జదువులెవ్వాఁడింక,
పటుశాస్త్రములుపఠిం-పంగఁజేయు।
నెవ్వఁడాచారంబు-లెల్లశిక్షించునో,
తండ్రినీవిట్లుదు-ర్దశవహింప।

గీ. అమ్మరో నాకుభోజనం-బరితోనొ।
సంగునెవ్వతెయుపదంశ-సంగతముగ।

తరక్షుముఖమృగములరచి-ధరణింద్రదిశ్యెన్॥ ౭౩

గీ. ధరణినాథపృషత్కని-ర్దళితమృగని।
కాయఘనకాయగళితర-క్తప్రవాహ।
చయముప్రవహించెగైరిక-శైలసాను।
భాగసంజాతనిర్ఝర-పఙ్క్తిపగిది॥ ౭౪

క. ఆరాజునియానతిఁ।
భూనిభటుల్ చెంచుదొరలు-బోరిగుహలఁబ్రతి।
ధ్వానములీనఁగనార్చుచు।
మానితశునకములనేర్ప-మరవిడిచిరొగిన్॥ ౭౫

ఆ. అవియురూపవీర్య-జవసత్త్వములసింహ।
శాబకములఁబోలఁ-జాలుఁగాన।
మృగమృగసమూహ-నిగ్రహంబొనరించె।
నతులనఖరదంష్ట్రికాయుధముల॥ ౭౬

ఉ. అంతటవారలున్ మృగప-దాంకమువెంబడినేగికుంజపుం।
జాంతరసీమఁబొంచినమృ-గావళిఁద్రుంచియురజ్జుజాలసం।
క్రాంతినిలోఁగిచిక్కినమొ-కాలవధించియుదీములొడ్డవి।
భ్రాంతివహించికేళ్ళురుకు-వానినిఁగూల్చియుఁబెక్కు-భంగులన్॥

వ. ఇవ్విధంబున నాఖేటచాతుర్యపాటవ నిరాఘాట చటులాటవిక వీరభటశ్రేష్ఠులు గరిష్ఠవిక్రమాకుంఠ మృగయావినోదాయత్తచిత్తులై మత్తేభంబులఁద్రుంచియు లులాయంబులమాయించియు శార్దూలంబులమర్దించియు గండకంబుల ఖండించియు శరభంబులంబరిమార్చియు శల్యంబులంద్రిళ్ళించియు వన్యవరాహమృగనికరంబులందెగటార్చియు తెరవేటగంటవేటమొదలయిన వేటలన్నియు ఘటియించియు తనడెందంబునకానందంబు సంపాదింపుమఁ దోడంజనుదేర మఱియు నాధరణీశ్వరుండు ధనుర్ధరుండై కాంతారంబులంబర్వతంబులం గుహాంతరంబులం దగినయెడల

విప్రకుమారకయమలో।
కపాత్రిప్తికి నేగ వలదయ్యె-గాలవశమునన్॥ ౭౯॥

మ. సురలున్నిద్రులు సాధ్యులున్మునులు-యక్షుల్ నాగగంధర్వకిం।
పురుషుల్ దైత్యులు మర్త్యులన్యులుజగ-త్స్వాజ్యత్ము లెయ్యెప్పు వా।
క్తరుణీనాధముకుందచంద్రధరులుం-గాలక్రమప్రక్రియన్।
విరతింబొం దెదరందఱున్ గుణనిధీ-నీ కేలశోకింపఁగన్॥ ౯౯॥

గీ. అద్వయము సచ్చిదానంద-మప్రతర్క్య।
ముపనిషద్గతము బ్రహ్మ-మొకటినూవె।
చెడదు పుట్టదు పెరుగదు-జీర్ణభావ।
మందదు స్వయంప్రకాశమై-యమరుచుండు॥ ౧౦౦॥

సీ. పాపకామక్రోధ-భయమోహమాత్సర్య,
కారణంబత్యంత-కష్టకరము।
పరదారపరవిత్త-హరణైకలోలంబు,
కలుషద్వారా కార-విలసనంబు।
మలమూత్రదుర్గంధ-నిలయంబు సాంద్రపూ,
యాసృగ్వసాపంక-భూసతంబు।
నవరంధ్రిసహితంబు-నానావిధక్రిమి,
సంకులంబు జడంబ శాశ్వతంబు।

గీ. బహుతరక్లేశహింసాది-భాజనంబు।
నిందితంబట్టి దేహంబు నందు నాత్మ।
బుద్ధిగావించి తిరమని పొదలు నెవ్వఁ।
డతఁడు మూఢుండు దుర్గతి-యతఁడు సుమ్ము॥ ౧౦౧॥

వ. బహుచ్ఛిద్రఘటాకారంబైన శరీరంబునం బ్రాణవాయువు చిరకాలంబు నిలువ నేరదు కావున జననీజనకులంగూర్చి శోకంబు సేయకుము. వారు స్వకర్మవశంబునం జేసి కళేబరంబులు విడిచిచనిరి. నీవు నుగర్మవశంబున భూతలంబున నున్నవాఁడవు కర్మక్షయంబగు నెప్పుడప్పుడ పరలోకంబునకుం జనఁగలవు శరీరాపస్థానంబుకర్మ

జననియెవ్వ తెయిఁక బాల్య-చాపలమునఁ।
బోరువెట్టెడివనుఁ జేరి-బుజ్జగించు॥ 2॥

గీ. జీర్ణపర్ణంబుపారణ-శిధిలతనుల।
నిరపరాధులద్వృథతపో-నిష్ఠగలుగు।
వారిమిమ్ములనిపుడుని-ష్కారణంబ।
చంపెనెవ్వఁడుదారుణ-సాయకముల॥ 3॥

వ. అని పెక్కుభంగుల నమ్మునికుమారుండు పెద్దయెలుంగెత్తి రోదనంబు సేయుచుండె నంతం దత్ప్రలపితంబాలకించి శంకరభూపాలుండు శబ్దంబునకభిముఖుండై చని గుహాద్వారంబుఁ జేర నచ్చటి మునులందఱు నయ్యాక్రందనంబువిని తదాశ్రమంబునకు సత్వరంబుగా వచ్చి శరనిహతులైన మునిదంపతులం గాంచి ధనుర్ధరుండగు రాజును విలోకించి విలపించుచున్న మునిపుత్త్రునిం గని భృశవివ్వాలులై భీతచేతస్కుండైన మునిపుత్త్రు నాశ్వాసింపు చునిట్లనిరి.

క. ధనియెడనిస్వునియెడన।
జ్ఞానియెడఁబండితునియెడఁగృ-శునియెడలందీ।
మునియెడలనైననంతకుఁ।
డనఘాసమవర్తిసంశ యము లేదుసుమీ॥ 4॥

క. వనమునసభమునగ్రామం।
బుననగమున నెట్టిదేశ-మున నెచ్చటనుం।
డినఁగానియమునివశతం।
జనవలయున్సకలజంతు-సంతతికనఘా॥ 5॥

గీ. బాలకులువృద్ధులగువారు-బ్రహ్మచారు।
లరయగృహమేధులును విపి-నాలయులును।
యతులునుశరీరములువిడ-నాడియముని।
వీఁడుజొత్తురుకాలంబు-రూడెనేని॥ 6॥

క. విప్రులుక్షత్రియులును వై।
శ్యప్రవరులుశూద్రులితర-సంకరజాతుల్।

విడిచెద నెమ్మేను-విప్రహత్యాపాప,
శాంతికినై భవ-త్సవిధభూమిఁ।
గాయపరిత్యాగ-కలన చేమత్కృత,
దోషం బశేషంబుఁ-దొలఁగునట్లు
ఘనులార నాకను-గ్రహము సేయుఁడు మీర,
లని మునీంద్రులతోడ-నాడి తనదు

గీ సచివులను బిల్చి పల్కె-వి-చారమెడలి।
చేసితిని బ్రహ్మహత్యదు-శ్శీలపరత।
వెలఁదిఁ జంపితి గానఁ ద-త్కలుషశోధ।
నార్థమనలంబుఁ జొచ్చి దే-హంబు విడుతు॥ ౧౦౬॥

వ ఇంధనంబులు శీఘ్రగతిం దెచ్చి వహ్ని దరికొల్పుండు. మత్పుత్త్రు
ని రాజ్యంబునం బ్రతిష్ఠింపుఁడు. శోకంబు మానుఁడు, దైవంబు
దురతిక్రమం బని యేలిక పలికిన పలుకులు విని దుఃఖింపుచు మంత్రు
లిట్లనిరి॥ ౧౦౭॥

ఉ శత్రులకైన మేలెపుడు-సల్పెడివాఁడవు పాండ్యభూపతీ।
పుత్త్రులఁ బ్రోచినట్లు మముఁ బ్రోచితి నిత్యము నిన్నుఁ బాసి లో।
కత్రయగణ్య యెట్లు చనఁ-గాఁగల మూ జ్వలితాగ్నిఁ జొచ్చి మా।
గాత్రములుం జగించెదము-తథ్యము సుమ్మని పల్కె వారితోన్॥ ౧౦౮॥

వ రాజిట్లనియె. ౧౧౦॥

మత్తకోకిల.

ఓమహామతులార చెప్పెద-నొక్కమాట వినుండు నే।
నేమి సేయుదు ఘోరపాతక మిట్లు చేసితి రాజనై।
భూమి యేలఁగ నాకుఁ జెల్లదు పొందుగొబ్బున వీటికిన్।
మామకాత్మజు రాజుఁ జేయుఁడు-మానుఁడాత్మలశోకమున్॥ ౧౧౦॥

వ. అనిసాంత్వన పూర్వకంబుగాఁ బలికి మంత్రులనొడంబరచి తదా
నీతచారు సమేధితంబై ప్రజ్వలింపుచున్న మహాజ్వాలనంబుఁ గ
నుంగొని ౧౨౧॥

దీనంబుగావున శోకంబువలదు. ధైర్యబవలంబించి సమాహితుండవై తల్లిదండ్రులకు బ్రేతకార్యంబులు వేదోక్త ప్రకారంబున నాచరింపుము. నీ తల్లియుం దండ్రియు శర ఘాతంబున మృతిం బొందిరి గావున వారికి దుస్తరణ దోష నివృత్తి యగునట్లుగా రామేశ్వర క్షేత్రంబునకుం జని యందు పైతృక క్రియా కలాపంబు సర్వంబును గావింపుమని మహామునులుపదేశించిన శాకల్యానందనుండైన జాంగలుండట్లు పితృదేహంబులు సంస్కరించి మరునాడు రామేశ్వర క్షేత్రంబునకుంజని యొక్క సంవత్సరంబు వసించి తదంతిమ దివసంబున నిశాసమయంబునం గలలోనం దల్లిదండ్రుల హరిసారూప్యంబు వహించినవారిం జూచి సంతసిల్లి మునులకావృత్తాంతంబు వినిపించి సుఖించుచుండె నంతనమ్మహర్షు లారాజుంజూచి కోపించి పరుషభాషణంబుల నిట్లనిరి. ౧౦౨॥

క. మోహాంధపాండ్యభూవర!
బాహుబలోన్మత్త వంశ-పాంసనకుమతీ!
స్త్రీహత్యయుద్విజహత్యయు
సాహసివై చేసితివియ-సన్మార్గరతీ॥ ౧౦౩॥

ఆ. కానవహ్నియందుఁ గాయసంత్యాగంబు!
సేయుమిప్పుడిట్లు-సేయవేని!
శుద్ధినీకులేదు-సుమ్ము ప్రాయశ్చిత్త!
కోటిచేతనైనఁ-గుత్సితాత్మ! ౧౦౪॥

క. దోషాధారంభవత్సం!
భాషణమాత్రముఁ వచ్చు-బ్రాహ్మణహత్యా!
దోషామయిఁతంబుదుష్టము!
నీషామావంకసంక-నిలుపకచనుమీ॥ ౧౦౫॥

సీ. నావుఁడుశంకర-భూవిభుండపుడుచవలె,
నగుఁగాకహవ్య వా-హనునియందు!

కుంకుమకర్పూరంబుల రామనాథునిం బూజింపుము. పాయసాన్నాది వివిధపదార్థంబుల నైవేద్యంబు సమర్పింపుము. తిలతైలంబునఁ బ్రతిదినంబు దీపారాధనం బొనర్పు మిట్లు రామేశ్వరుం గొల్చిన యక్షణంబ నీకు స్త్రీహత్యయుం బ్రహ్మహత్యయు నశించు. రామనాథునిదర్శనంబున భ్రూణహత్యాయుతంబును, సురాపానాయుతంబును, స్వర్ణస్తేయాయుతంబును, గురుస్త్రీగమనాయుతంబును, తత్సంయోగిదోషంబులును, సకలపాతకంబులును దొలంగు. ౧౧౬॥

సీ. ఎంచ రామేశు సేవల-భించె నేని।
గంగ చేఁగయ చేఁ బ్రయా-గంబు చేత।
నేమి వివిధాధ్వరంబుల-నేమి ఘోర।
తపము చే నేమి నరులకు-ధరణినాథ॥ ౧౧౭॥

తే. కావున సేతువునకుఁ జను।
మీవు శివుఁ రామనాథు నీశ్వరు నభవుఁ।
సేవింపు మిఁక విలంబము।
గావింపకు మిపుడె చనుము-గాఢవివేకా। ౧౧౮॥

వ. ఇట్లాకాశవాణి పలికిన పలుకులు విని॥ ౧౧౯॥

క. మునులందఱు శంకరనృపుఁ।
గనుఁగొని సేతువునకాశు-గతి నేగుము నీ।
వనఘా సేవకభవభం।
జనుఁ గొల్వుము రామనాథు-సదయస్వాంతుఁ॥ ౧౨౦॥

వ. రామనాథేశ్వరస్వామి మాహాత్మ్యంబెఱుంగక మేము నిన్నిట్లు లోఁ జొరుమంటిమని యమ్మహర్షులాడిన నట్లు వారిచే ననుజ్ఞాతుండై యా పాండ్యభూమండలాఖండలుండు॥ ౧౨౧॥

తే. కరితురగరథపదాతులఁ।
బూని మునకుం బంపి మునుల-బోలి వలగొని మ్రొక్కి।

గీ. స్నానమొనరించియాచమ-నంబుఁ జేసి।
శుచిమతియయిరోహితా-స్యునకుమాని।
పుంగవులకుఁ బ్రదక్షిణ-పూర్వకముగ।
మ్రొక్కి ధ్యానసమున సాంబ మూర్తినిలిపి॥ ౧౧౨॥

వ. ధైర్యంబవలంబించి శంకరవసుంధరావల్లభుండు వహ్నిలోననురు
కంబారంభించెను. ౧౧౩॥

గీ. ప్రాకృతాంభోధరధ్వని-ప్రతిమభయద।
నాదము సెలంగ మానిబ్బం-దము వినంగఁ।
బాండ్యకులరత్నమైన యా-ప్రభుని గూర్చి।
యప్పుడాకాశవాణియి-ట్లను చుఁబలికె॥ ౧౧౪॥

సీ. శ్రీశంకర క్షమా-ధీశ వహ్నిప్రవే,
శముఁ నీవిప్పుడు సేయ-కుము మహీశ।
పర్వహత్యామహా-పాతకోగ్రభయంబ,
దణగదు నీకు గు-ణాలవాల।
చెప్పెద నవహిత-చిత్తమదుపదే,
శము వినుసద్వేద-సమ్మితంబు।
దక్షిణాంభోరాశి-తటమునగంధమా,
దనమహాధారణీ ధరమునందు।

గీ. రామసేతువునందు శ్రీ-రామచంద్ర।
సంప్రతిష్ఠితు రామేశు-సర్వగురుని।
శివునిగౌరీశనాథుని-సేవసేయు।
మచటభక్తిసనీవొక-హాయనంబు॥ ౧౧౫॥

వ. త్రికాలంబును బ్రదక్షిణనమస్కారంబులు సేయుము. ప్రత్యహంబు రామేశ్వరస్వామికిఁ గవ్యఘృతభాండద్వయంబునను, ద్విభారపరిసమ్మితంబులైన గోక్షీరంబున ద్రోణపరిమాణంబగు మధురసంబునను, మహాభిషేకంబాచరింపుము. ప్రతిదినంబు చందనాగరు

శ్లో. మార్కండేయభయత్రాణమృత్యుంజయశివాత్మయ।
నమస్తే గిరిజానాథాయ నిష్పాపం కురు సర్వదా॥ ౧౨౯॥

శ్లో. రుద్రాక్షమాలాభరణ చంద్రశేఖర శంకర।
వేదోక్తసమ్యగాచారయోగ్యమాం కురు తే నమః॥ ౧౩౦॥

శ్లో. సూర్యదంతభిదే తుభ్యం భారతీనాసికాభిదే।
రామేశ్వరాయ దేవాయ నమో మే శుద్ధిదో భవ॥ ౧౩౧॥

శ్లో. అనంతసచ్చిదానందం రామనాథం వృషధ్వజం।
భూయోభూయో నమస్యామి పాతకం మే వినశ్యతు॥ ౧౩౨॥

గీ. ఇవ్విధంబున రామేశు-నిందుధరుని।
వినుతి సేయుచునున్న య-మ్మనుజవిభుని।
యానసంబున వెడలెను-హాభయంక।
రస్వరూపిణియైనట్టి-బ్రహ్మహత్య॥ ౧౩౩॥

ఆ. అట్టిబ్రహ్మహత్య-నతిఘోరమూర్తిని।
జూచి భైరవుండు-శూలహతిని।
సంహరించె రుద్ర-శాసనంబున నంత।
రామనాథుఁ డనియె-రాజుతోడ॥ ౧౩౪॥

క. క్షితినాథ నీయఘౌర।
స్తుతులన తిప్రీతమాన-సుఁడనైతి భవ।
త్కృతపూజనమున మును దె।
దితిని చ్చెదవరము వేఁడు-ధీరవరేణ్యా॥ ౧౩౫॥

వ. స్త్రీహత్యాబ్రహ్మహత్యలవలననైన నీదోషంబు దొలంగె శుద్ధుండవై తివి. మున్నువోలె రాజ్యంబుఁ బాలింపుము. భక్తియుక్తంబగు హృదయంబున నెవ్వారు నన్నిచ్చోట సేవింతురు వారి బ్రహ్మహత్యలు పదివేలైన నశింపంజేయుదు. మహాపాతకాయుతంబుల నైన క్షణమాత్రంబున విదళింతు. నన్ను సేవించుజనులు సంసరణక్లేశరహితులై మత్సాయుజ్యంబు నొందుదురు. నీ చేసిన స్తోత్రంబు భక్తికంబుగాఁ బఠించిన వారికి మహాపాపసంచయంబు నశించు

క్కరభసమునఁ గతిపయాబ్దః
పరివృతుఁడై తాను సేతు-బంధంబునకుఁ॥ ౧౨౨॥

సీ. చని సేతువున నొక్క-సంవత్సరము నిల్పి,
భక్తిపూర్వకముగఁ-బ్రత్యహంబు।
మూఁడు సంధ్యలయందు-ముదమునఁ బూజించి,
రామనాథేశ్వర-స్వామి నభవుఁ।
గొనకొని యులధను-ఘోటిని బ్రతివాస,
రంబును మునిఁ గని-రంతరంబు।
ధరణీసురలకన్న-దానంబుఁ గావించి,
యేకభుక్తము జేసి-యింద్రియముల।

గీ. గెలిచె నొప్పుగ దశభార-ముల ధనంబు।
రామనాథుని కొసఁగెనీ-క్రమము చేత।
సభ్రిభారతి చెప్పిన-యట్లు పూజ।
నంబు తగ సల్పె నా పాండ్య-నరవిభుండు॥ ౧౨౩॥

క. అంతట శంకరు నృపుఁడ।
త్యాంతిమ దివసమునఁ బ్రీతుఁ-డై హైమవతీ।
కాంతుని రామేశ్వరుని।
నంతుని బొగడంగఁ దొడఁగె-నచలితభక్తిన్॥ ౧౨౪॥

శ్లో. నమామి రుద్రమీశానం రామనాథ ముమాపతిం।
పాహి మాం కృపయా దేవ బ్రహ్మహత్యాందహాశు మే॥ ౧౨౫॥

శ్లో. త్రిపురఘ్న మహాదేవ కాలకూటవిషాదన।
రక్ష మాం కరుణాసింధో స్త్రీహత్యాం మే విమోచయ॥ ౧౨౬॥

శ్లో. గంగాధర విరూపాక్ష రామనాథ త్రిలోచన।
మాం పాలయ కృపాదృష్ట్యా మత్పాపం ఛింధి శంకర॥ ౧౨౭॥

శ్లో. కామారే కామసంధాయిన్ భక్తానాం రామపేశ్వర।
కటాక్షపాతం కురు మే శుద్ధం మాం కురు ధూర్జటే॥ ౧౨౮॥

శా త్రవక్షితినాథభూధర-శతప్రోద్దీవిజయంబునన్।
ధాత్రియేలెను బాండ్యశంకర-ధారుణీశ్వరుఁడున్నతిన్॥ ౧౪౨॥

మ. కురిసెన్వృష్టి ఫలించెసస్యవితతుల్ -గోవుల్బహుక్షీరముల్।
గురిసెన్శ్రీగభయాపమృత్యుజనిత-క్షోభంబడంగెం బజల్।
సిరిచేహెచ్చిరియజ్ఞకర్మములు బ్రా హ్మ్యాల్గుపాదంబులం।
బరగెన్ ధర్మముపాండ్యశంకరుఁడుసా-మ్రాజ్యంబు గావింపఁగాన్

వ. ఇవ్విధంబున సముద్రముద్రితమహీమండలంబు చిరకాలంబు పాలించి పుత్త్రునకు రాజ్యంబొసంగి శంకరమహారాజు శరీరాంతంబున రామేశ్వరమహాదేవునిం జింతించుచుఁ దత్సాలోక్యము క్రీవడసె నీప్రకారంబున మీకు రామేశ్వరమాహాత్మ్యంబు వివరించితి నీయుపాఖ్యానంబు పవిత్రంబు లక్ష్మీకరంబు పుణ్యంబు దుఃఖహరంబు దుస్స్వప్నదోషనివారణంబు మహాశాంతికరంబు సకలార్థకారణంబు దీనిం బఠించినవారికి విన్నవారికి స్వర్గాపవర్గంబులు సిద్ధించు జ్యోతిష్టోమాదియజ్ఞఫలంబును చతుర్వేదశతావృత్తిఫలంబును సకలతీర్థస్నానఫలంబును షోడశమహాదానఫలంబును లభించును. బ్రహ్మవిష్ణుమహేశ్వరలోకనివాసంబు దొరకు శివసాయుజ్యంబు సంభవించు సకలకామంబులుఫలించుమనని నిఖిలపురాణవ్యాఖ్యానసమేతుండగుసూతుండు పలికినవిని నైమిశారణ్యనివాసులు శౌనకాదిమహర్షులు సంతుష్టిం జెందిరి. సూతుండుకైలాసంబునకుంజనియె నిమ్మహాప్రబంధంబు వ్రాసిన పుస్తకంబర్చనఁజేసిన వారాధించిన శ్రీరామేశ్వరుండాయురారోగ్యైశ్వర్యంబులు శాశ్వతమోక్షపదంబునుం గృపసేయు॥ ౧౪౪॥

శా. భక్తారామవసంతశాంతమునిహృ-త్పద్మాంత రంగీనస।
మ్ముక్తాహారపటీరహీరశరదం భోభృద్వ్యళేశాంగ వే।
దోక్తానంతగుణప్రభావపరిపూ-ర్ణోదారకారుణ్య సం।
సిక్తప్రేక్షణవిశ్వరక్షణచణా-శ్రీమత్త్రిశూలాయుధా॥ ౧౪౫॥

నీభక్తితాత్పర్యవిశ్వాసస్తోత్రపూజావిధానంబులం బ్రసన్నుండ
నైతి. యథేష్టంబుగా వరంబు ప్రార్థింపుమని రామేశ్వరుం డాన
తిచ్చిన శంకరమహారాజిట్లనియె. ౧౩౬

ఉ. ఇందుకళావతంసపర-మేశ నినుంగనుఁగొంటిధన్యతం।
జెందితి నింతకంటె నువి-శేషవరస్థితి లేదు నాకు సా।
నందమ్ము కందుపుత్రభయ-నాశకతారకపాదపద్మని।
ష్యందసుభక్తిసంపదయొ-సంగుము పాతకతూలపావకా॥ ౧౩౭॥

ఆ. జననిగర్భగోళ-మునఁ బునర్జని నాకుఁ।
దప్పఁగాత మత[illegible]-త స్తవంబుఁ।
దగఁ బఠించునరుఁడు-ధన్యుఁడై నీ సేవఁ।
గలుగు పుణ్యఫలముఁ-గాంచుఁ గాత॥ ౧౩౮॥

క. అని వేఁడిన నట్లగుఁగా।
కని యతని ననుగ్రహించి-యల రామేశుం।
డనుపమ లింగాకారం।
బున నంతర్ధానమొందె-భూసురులారా॥ ౧౩౯॥

క. నరపతియు రామనాథుని।
గిరిజావల్లభునిఁ గొలిచి-కృతకృత్యతచేఁ।
గరమొప్ప మునిజసేనా।
పరివృతుఁడై చనియె నాత్మ-పట్టణమునకున్॥ ౧౪౦॥

గీ. అంత వనవాసులైన మ-హామునులకుఁ।
దనదువృత్తాంతమంతయు-ధరణివిభుఁడు।
విన్నవించిన వారు ప్ర-సన్నులగుచుఁ।
జెలఁగి పట్టాభిషిక్తునిఁ-జేసిరతని॥ ౧౪౧॥

మత్తకోకిల.

పుత్రదారసమేతుఁడై బహు-భోగియై గుణశాలియై।
శ్రోత్రియద్విజరక్షకుండయి-సూర్యసన్నిభతేజుఁడై।

క. గురుజానపల్లిపట్టట।
పరిపాలనశీలభక్త-పరతంత్రమతీ।
గిరిరాయకన్యకాకుచ।
పరిరంభణభోగసుఖిత-భాసురహృదయా॥ ౧౪౬॥

మత్తకోకిల
భద్రిరాజకులాబ్ధికైరవ బంధుమల్లనమంత్రిరా।
డ్భద్రదాయకపాదపంకజ-పంకజాసనసారధీ।
క్షాద్రవేయసుభూషణోజ్జ్వల-గాత్రగోత్రశరాసనా।
సద్రయోక్షతురంగదైవత-సార్వభౌమమహేశ్వరా। ౧౪౭॥

గద్య:— ఇది శ్రీమదుమామహేశ్వర కరుణాకటాక్షవీక్షాపాత్ర,
యేనుగ లచ్చయామాత్యపౌత్ర తిమ్మనామాత్యపుత్త్రి,
వివిధ విద్వజ్జనవిధేయ, లక్ష్మణకవినామధేయప్రణీ
తంబయిన రామేశ్వరమాహాత్మ్యంబను
మహాప్రబంధమునందు సర్వంబును
బంచమాశ్వాసము
సంపూర్ణము.
శ్రీ.శ్రీ.శ్రీ.